

ది. 11-8-1986నాడు హిందీ మహా విద్యాలయము, విజయవాడ స్వతంత్రోత్సవము జరిగిన సందర్భమున తీయబడిన ఛాయాచిత్రం- ఇందు సభ అధ్యక్షులు శ్రీ వేమూరి సుబ్బారావు గారు మధ్య కుర్చీలో ఆశీనులై ఉన్నారు. కుడిప్రక్క విద్యాలయ ప్రిన్సిపాలు శ్రీ కాజ వెంకటేశ్వరరావుగారు. ఎడమ ప్రక్క సభ కార్యదర్శి శ్రీఎ. రామస్వామి గారు ఆసీనులై ఉన్నారు. నిలబడినవారు విద్యాలయములో పనిచేయుచున్న అధ్యాపకులు.

# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక

388

ఆగష్టు, 1986 — సంపుటి : 33, సంచిక 5

వార్షికచందా : పదిహేను రూపాయలు :: విడిప్రతి : రూపాయిన్నర

## ఈసంచికలో

# సంపాదకీయం

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యవర్గం వారు యిటీవల సమావేశమైనపుడు తీసుకొన్న నిర్ణయాలలో రెండు ప్రధానమైన నిర్ణయాలు జరిగాయి. సభ వారు నిర్వహించే రాష్ట్రభాష, విశారద, ప్రవీణ పరీక్షలలో ఉత్తీర్ణులయిన వారికి బి.ఏ. పరీక్షలు వ్రాసే సౌకర్యం కల్పించడం కోసం ఆంధ్ర సభ తరపున విజయవాడలో మాచవరంలో ఉన్న సభ స్వంత భవనంలో ఒక బి.ఎ. డిగ్రీ కాలేజి ఈ సంవత్సరం నుంచే ప్రారంభించాలనే నిర్ణయం ఇందులో ప్రధానమైనది. ఈ కాలేజీలో నియమంగా అధ్యయనం చేసేవారికి తమకున్న హిందీ యోగ్యతల ద్వారా ప్రయోజనం కల్గుతుంది. వీరికి కొన్ని పేపర్ల నుంచి మినహాయింపు లభించటానికి అవకాశం ఏర్పడుతుంది. సభ చేపట్టిన కార్యక్రమాలలో, తీసుకున్న నిర్ణయాలలో ఇపుడు తీసుకున్న ఈ నిర్ణయం ఒక మైలురాయి వంటిది.

ఆంధ్ర సభ స్వర్ణోత్సవాలు 1987 అక్టోబరు మాసంలో జరపటానికి కూడా నిర్ణయం జరిగింది. ఈ ఉత్సవాలు ఈ సంవత్సరమే నిర్వహింపబడి ఉండవలసినవి కాని కొన్ని కారణాల వల్ల జరగలేదు. 1987 అక్టోబరులో భారీ ఎత్తున ఉత్సవాలు నిర్వహించాలనీ, దానికొరకు యిప్పటినుంచే కార్యక్రమాలు తయారు చేయాలనీ నిర్ణయం జరిగింది. ఈ సందర్భంలో నిర్వహింపబడే స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్ష 1986 అక్టోబరు 19 వ తేదీన మరల జరుగుతుంది. స్వర్ణోత్సవనిధి వసూలుచేసే కార్యక్రమం ప్రారంభమయింది. చాలామంది పరీక్షార్థులు, హిందీ భాషాభిమానులు, హిందీ ప్రచారరంగంలో పని చేస్తున్న ప్రచారకులు ఈ కార్యక్రమాలకు తమ తోడ్పాటు నొసంగుచునే ఉన్నారు. సభ కార్యవర్గం వారి సహకారం, హిందీ ప్రచారకుల తోడ్పాటుతో ఈ రెండు నిర్ణయాలు సక్రమంగా అమలులోకి వస్తాయి. సభ కార్యవర్గ సభ్యులు ఈ నిర్ణయాలు తీసుకున్నందుకు అభినందనీయులు.

# శ్రద్ధాంజలి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ప్రధాన కార్యకర్తల్లో ఒకరున్నూ, హిందీ ప్రచార ప్రెస్సు వికాసానికి, మద్రాసులోను, హైదరాబాదులోను ఎక్కువ తోడ్పడినవారు, దక్షిణ భారత హిందీ ప్రచార సభ సంయుక్త కార్యదర్శిగా పని చేసిన వారు అయిన **శ్రీ గోవింద అవస్థి** గారు ది.15-9-86 న మద్రాసులో ఆకస్మికంగా పరమపదించారు. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించుచున్నాము. వారికి మా శ్రద్ధాంజలి.

# రాగమై క్రాంతియై

మాదిరాజు రంగారావు

నాలో ప్రవహిస్తోంది నది
శుష్కమైన విషాద తలాన్ని ఆర్ద్రించేస్తూ
మలినమైన ఆలోచనల్ని స్నిగ్ధపరుస్తూ
గతిలో నిరంతరం ఆగని మానవ చరిత్రతో
మార్మిక క్షితిజం నుండి దిగి వాస్తవతలంపై
ప్రవహిస్తోంది నాలోనది.

తుపాను గాలికి కల్లోలమై ఎగసి పడుతూ
అపుడపుడూ తప్పని విధ్వంసక చరణంతో
బ్రతుకులో బీభత్స దృశ్యాలతో
కలహాలనూ యుద్ధాలనూ జ్ఞాపకం చేస్తూ
శరీర కణకణంలో ఆలోచనా పదపదంలో
ప్రసరించే విద్యుత్ నవరాగకళతో—

నాలో ప్రవహిస్తోంది నది
రాత్రి ఎంత చీకటి కురిసినా ఆక్రమించినా
తెల్లవారేసరికి ఏ జాడ అంటకుండా
పగటి ఇంద్ర జాలాల్నీ, రాత్రి స్వప్నఖండాల్నీ
అగాధంలోకి విసరి పారేసి
నాలో ప్రవహిస్తోంది జీవితం.

నాలో ప్రవహిస్తోంది నది
దాచిన సహస్రకాంతి బాహువుల్లోకి
క్షణం నుండి క్షణానికి స్థలం నుండి స్థలానికి
కదలిపోయే శరీరాల్ని గ్రహిస్తూ
మృదువుగా స్పృశిస్తూ అమృతమయంచేస్తూ
ప్రసరించే విద్యుత్ నవరాగంతో నాలో

(2)

నాలో ప్రవహిస్తోంది నది
స్విచ్ వేసిన టార్చి వెలుగువలె
అంతరంగంలో అనుభవతలంపై ఒకటై
అది సరించినంత మేర అడవుల్లో
ఎక్కడెక్కడో దాగిన భయ సుందర ప్రాణులు
ఎదుట వచ్చి నిలుస్తాయి అంచుల్లో ఒదిగి

నాలో ప్రవహిస్తోంది నది
పగలూ రాత్రీ స్థితులకందకుండా
విడిపోయే ఊహారాని ధరిత్రీబంధంతో
నాలో భాగమై సుందరమై స్త్రీరూపమై
సృజన శక్తి గర్భంతో స్వాదుఫలరుచితో
నాలో వ్యక్తియై ప్రపంచమై ప్రయోజనమై

నాతో ప్రవహిస్తోంది నది
తనువుతో మరచినవి జ్ఞాపకం చేస్తూ
అంగారం ఉంది దీనిలో బిందువులో
జీవశక్తికి మూల నిలయమై
ఆగని గతి ఉంది పైన చలనంలో
జీవితానికి వాస్తవాకృతియై

నాలో ప్రవహిస్తోంది నది.
నీల గగనం ప్రతిఫలించిన జలతలంపై
ఛాయాతప స్ఫాటిక హిమ సంధ్యారుణ
హరిత శ్యామనీలకాంతి లహరియై
సమయ సమయం వివిధ దృశ్య పరంపరతో
రాగమై సుందరమై భోగమై భ్రాంతియై !

క్వార్టర్ నం: 14, విద్యారణ్యపురి,
కాకతీయ యూనివర్సిటీ,
వరంగల్-506 009.

# దిగంబరి

— శ్రీ పిడపర్తి వెంకటరామశాస్త్రి

"ఏయ్, దిగంబరీ
సిగ్గులేదూ ?
నగరంలో
నడి బజారులో
నాలుగు వీధుల మొగలో
ఎందరో పెద్దలు
ఇలా వస్తూ పోతూ ఉంటే
అలా కూర్చున్నావు ?"

" ఏయ్ దిగంబరీ
సిగ్గులేదూ
నగరంలో
నడి బజారులో
నాలుగు వీధుల మొగలో
ఎందరో పెద్దలు
దిగంబరులై
ఇలా వస్తూ పోతూ ఉంటే
సిగ్గులేకుండా
స్వైరవిహారం చేస్తూ ఉంటే
ఏమీ పట్టనట్లు ఊరుకొన్నావు

సిగ్గులేదూ ?
"ఏయ్ దిగంబరీ
రోహిణీ కార్తిలో
మండుటెండలో
తారు రోడ్డుమీద
ఒళ్ళు కాలడం లేదు!
ఏమనాలి !
నిన్ను ఏమనాలి ? "

" ఏయ్ దిగంబరీ
ఎండా వాన అనకుండా
ఎన్నో కడుపులు కాలుస్తూ
పగలు రాత్రి అనకుండా
ఎన్నో మనసులు మాడుస్తూ
రంగు రంగుల ముఖాలతో
ఆకాశపు నడి బజారులో
ఒంటిమీద బట్ట మరిచి పోయి
తిరుగు తున్నారు
ఏమనాలి ? మిమ్మల్ని ఏమనాలి? "

రాజమండ్రి

# మిని కవితలు

హిందీ మూలం :
కేదార్‌నాథ్ కోమల్

తెలుగు సేత :
డా॥ ఆర్.యస్.రాజు

* నిజం. నీవెంత అందమైనదానివి
నక్షత్రాలతో శబ్దాలు రాస్తూ-రాస్తూ
ఆకాశం అయిపోయాను

* వివశత్వం వివశత్వం వివశత్వం
మనిషికి మనిషికిమధ్య
ఎంతదూరం

* సూర్యునిలా ప్రకాశవంతమైన
ఒకమాట చెప్పాలనుకుంటున్నా
ఒకశబ్దం రాయాలనుకుంటున్నా
ఈ భూమి అంతా మేల్కోవాలని
ఈ ప్రపంచమంతా నాట్యం చేయాలని

—

* మనం ఉన్న చీకటే మనుచరిత్ర
కానీ ప్రగతి వెలుగులో మనం
ఎలాంటి పనులు చేస్తామంటే
రాత్రికూడా మననుంచి
ముఖం తిప్పుకొని వెళ్లిపోతుంది

—

* నాకో మహిళ తెలుసు
ఆమె పోలిక నాయీ గీతపు
ప్రతిపంక్తిలోనూ కలుస్తుంది

* పొద్దున్నే దమనుల
ఎర్రటి రక్తంలో ఉప్పొంగుతుంది శ్రమ
సంగీతం

* ఆకలి శతాబ్దాల క్రితం కూడా ఏడుస్తూ
ఉండేది
చేతులు జోడించి నమ్రతతో
ఆకలి ఈరోజూ ఏడుస్తోంది
నిత్యం కొత్తదనం పోకడంతో మేకప్
చేసుకొని ....

—

* ఈ ప్రపంచం అంతా కూడా దాలనివాడికి
ఒక సమాధి అవసరం కంటే ఎక్కువ

—

* జీవితపు రూపం
ఎంత మారిపోయింది
మంచితనం
అమ్మ తిట్టు అయిపోయింది

—

* సముద్రం ఒక కల
నేను కలల సముద్రాన్ని

—

* ఒక బుర్లి బిందువు
నిన్ను చూస్తూనే

సముద్రం అవ్వాలని
ఆతృత పడుతుంది

—

* నరాల్లో బాధ
సముద్రపు కెరటాల సరిగమలా పాడుతుంది

—

* పక్షి కంఠంలో ప్రతిధ్వనిస్తూ
సరిగమల సప్తస్వరాలూ
వ్యాకులంగా ఉన్నాయి
ఏడు సముద్రాల్లా
రాత్రీ పగలూ...

—

సముద్రంలో నభోమండలం నృత్యం చేస్తుంది
నృత్యంలో సముద్రం తప్పిపోయింది

కేదార్‌నాథ్ కోమల్,
ఈ-97, సరోజినీ నగర్,
న్యూఢిల్లీ-110 023.

# నేను చూశాను

హిందీ మూలం :

తెలుగుసేత :
కాళిపు వీరభద్రుడు

నేను చూశాను
—సాగరమ్మీద తేలియాడే

నురగలోంచి బయట కొచ్చిన
బిందువునీ—

అస్తమిస్తున్న సూర్యుని అరుణకిరణాలు
దానికి రంగు వేయడాన్నీ !
నాకు కనిపించింది :

ప్రకాశాన్ని పొందిన దాని అస్తిత్వం
అశాశ్వతమనే కళంకాన్ని
తొలగించుకొన్న దాని అమరత్వం

జూనియర్ లెక్చరర్,
ప్రభుత్వ జూనియర్ కళాశాలం,
నర్సీపట్నం-531 116.

# ఉరిత్రాడు

— పోరండ్ల సత్యనారాయణ

అది ఒక సాంప్రదాయ కుటుంబం. ఆ వూరిలో పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న శాస్త్రి గారిల్లది. శాస్త్రిగారు ఆ వూరిలోనే గొప్ప మనిషి. నాలుగక్షరాలు తెలిసిన పండితుడు కూడ. అతనికి ఒకకూతురు ఇద్దరు కుమారులున్నారు. కూతురు పేరు లత. కుమారుల్లో పెద్దవాడు రవి. రెండవవాడు కిరణ్. సమయం పది గంటలు కావస్తుంది రాత్రి. అందరూ భోజనాలు ముగించుకొని నిద్రకు ఉపక్రమిస్తున్నారు. కొందరు అప్పటికే నిద్రాదేవి ఒడిలో పవళిస్తున్నారు. శాస్త్రి గారి కుటుంబం కూడ పదిలోపే పడుకుంటుంది. ఒక్కొక్కరు వారి వారి పడకలపై ఒరిగినారు. సమయం గడిచిపోతుంది. దాదాపు రాత్రి పన్నెండు గంటలు దాటింది. అనుకోకుండా లత అకస్మాత్తుగా నిద్ర నుండి ఉలికిపడి లేచింది. తన చుట్టూరా పడుకున్న కుటుంబ సభ్యులను చూసింది. అందరూ నిశ్చలంగా, మౌనంగా పడుకొని ఉన్నారు. అయినా ఆమె మనసు ఎందుకో భయంగా ఉంది. నిద్ర పట్టడంలేదు. ఎవరిని లేపడానికి లత ప్రయత్నించలేదు. మెల్లగాలేచి లైట్ వేసి, వంటి ఇంటిలోని కెళ్ళి మంచినీళ్ళు త్రాగి వచ్చి, కొంతసేపు ఆలోచించి పడకపై మేనువాల్చింది ఆమెకు వచ్చిన పీడకల గురించే ఆలోచిస్తుంది లత.

"కలలు వాస్తవ మవుతాయా? ఈకలలు ఎందుకు వస్తాయి? కొందరు పగటి కలలు కంటుంటారని ఎప్పుడో లత విని ఉంది. కాని రాత్రులు కూడ కలలు వస్తాయని ఈనాటి వరకు ఆమెకు అనుభవం లేదు" కలల గురించి.

లత తండ్రికి నచ్చిన పెళ్ళికొడుకు గురించిన ఆలోచనలు మదిలో మెదిలి ఆమె గుండెలో గుబులు రేపినాయి ఆ క్షణంలో. ఆమెకు భర్త కాబోయే మనిషి ఒక త్రాగుబోతని, జూదగాడని ఎవరో అంటూండగా విని ఉంది లత. అతనికి స్నేహితులు కూడ ఎక్కువని తెలుసుకున్నది. లత అతని గురించి నానా రకాలుగా ఊహించుకొని భయాందోళన చెందుతుంది.

అతన్ని పెళ్ళి చేసుకొని తన బ్రతుకు నరకంగా మార్చుకోవడమా? తండ్రి మాట కెదురు చెప్పలేక తల వంచడమా? ఏమిటి? నాలాంటి కన్నెపిల్లకిది ఒక అగ్నిపరీక్ష అని విచారించింది లత. ఇంతవరకు అనుక్షణం ఆమె ఆలోచనల్లో మెదిలింది పెళ్ళికొడుకు విజయ్. 'విజయ్ చదువు, సంస్కారం ఉన్న కుటుంబంలో జన్మించి, పెద్ద చదువులు చదివాడు. ఆరడుగుల ఎత్తు, చామనచాయ రంగు, కోల ము●ం, ఎత్తుకు తగ్గ లావు- హిప్పీ కటింగ్, స్టైల్‌గా టక్ చేసుకున్నాడు "

పెళ్ళిచూపులంటేనే లతకు ఇష్టంలేదు. ఎందుకంటే పెళ్ళికూతురును ముస్తాబుతో మూగజంతువులా పెళ్ళికొడుకు ముందు కూర్చోబెడతారని, పెళ్ళికొడుకు తండ్రి, తల్లి వాళ్ళకు సంబంధించిన పెద్ద మనుషులు అడగే ప్రతి ప్రశ్నకు తల వంచుకొని సమాధానం చెప్పాలి కదా! ఇంటర్వ్యూకి కెళ్ళిన ఉద్యోగార్థిలా ఎదురు ప్రశ్న వేయడానికి వీలులేదు. ఈ పెళ్ళి చూపుల తతంగంలో అంటుంది లత నిట్టూర్పుతో-

పెళ్ళిచూపుల నాడు విజయ్‌ను చూసింది. అందంగానే పెళ్ళికొడుకు ఉన్నాడని గ్రహించింది. అమ్మ మాట కాదనలేక బలవంతంగా పెళ్ళిచూపులకు ఒప్పుకుంది లత. లత అమ్మ శాంత, లతంటే శాంతకు ఆరో ప్రాణం. మాటా ముచ్చటలు జరిగినవి. అందరు పెళ్ళికొడుకు వాళ్ళ సంబంధం చాలా మంచిదని అనుకొంటుండగా లత విన్నది. ఇరుగుపొరుగు అమ్మలక్కలు పెళ్ళికొడుకును చూసి, తగిన ఈడూ.జోడు పిల్లవాడు అందంగానే ఉన్నాడు. లత చాలా అదృష్టవంతురాలని సర్టిఫికెట్ యిచ్చి ప్రశంసించారు. లత, తల్లి ఎదుట పొగిడినారు ఆ వాడలోని ఆడవాళ్ళు,

లత అభిప్రాయాన్ని పెళ్ళి విషయంలో మాటవరసకైనా తీసుకోకుండా! ఆమె మనస్తత్వాన్ని ఖాతరు చేయకుండా, శాస్త్రిగారు పెళ్ళి ఖాయంచేశాడు. ఇలాంటి పతిస్థితిలో ఏ పెళ్ళికూతురైనా ఏం చేయగలదు? అందరిలాగే తను పెళ్ళికొడుకు బాహ్యసౌందర్యాన్ని చూసిందే తప్ప! అతని అంతరంగాన్ని క్షుణ్ణంగా చదువగలిగిందా! ఈనాటి పెళ్ళిళ్ళు తాత్కాలిక నిర్ణయాలతో కట్టుబడుతున్నందుకు లత చాలా బాధ పడింది.

'ప్రతి పెళ్ళికొడుకు పెళ్ళికి ముందు మంచివాడుగానే కనిపిస్తాడు. కన్నెపిల్ల మెడలో మూడుముళ్ళుపడ్డ తర్వాతే అతని అసలు రంగు బయట పడేది'- అనుకుంది లత.

నాకు ఇలాంటి కల రావడమేమిటి? ఈ పీడకలలాగే నా జీవితం నరక కూపమవుతుందా? నన్ను నా భర్త అష్టకష్టాలు పాలు చేస్తాడా? కల వాస్తవమవుతుందా! ఏది ఏమైనా ఈ కలలకు మనిషికి ఏదో అనుబంధ ముందనక తప్పదు. దూరంలో ఉండే గ్రహాల్లాగా కలలు కూడ మనుష్యులపై ప్రభావాన్ని చూపుతాయేమో? కలలు కూడ ఒక్కొక్కసారి నిజమవుతాయేమో! అనే అనుమానం రాక మానదు మనకు.

'లత మనసు అనేక విధాల పరుగులు తీస్తుంది. ఎన్నో ఆలోచనలతో లత మనసు బాధగా నిట్టూర్చింది. అయినా ఆమె ఆలోచనలకు అంతు చిక్కలేదు.

ఒకవేళ ఇలానే జరుగుతుందని, ఈ పెళ్ళి సంబంధాన్ని వదులుకుంటే తన లాంటి మధ్య తరగతి అమ్మాయిలకు ఈ జన్మలో మళ్ళీ పెళ్ళి జరుగుతుందా పెళ్ళంటే ఎంత బాధ నేడు! ఈ పెళ్ళిని కాదంటే నాన్న మనసు బాధ పడుతుందేమో! అని ఆలోచించింది లత.

సాంప్రదాయ కుటుంబమని. చదువుతున్న వాడని, ఎంతో కష్టపడి, వారడిగిన కట్న కానుకల నిచ్చి ఈ పెళ్ళి జరిపించడానికి సిద్ధపడ్డాడు నాన్న. అలాంటి నాన్న మాట కాదంటే నాకు ఈ ఇంటిలో స్థానముంటుందా! తండ్రి మాట ఎదిరించానన్న లోకనింద భరించగలనా? ఏది ఏమైనా! ఎలా జరిగేదుంటే అలా జరుగుతుంది. 'విధి రాతను ఎవరు తప్పించగలరు.' నా మూలంగా ఈ పెళ్ళి వాయిదా పడకూడదు. ఒకవేళ అలా జరిగితే మా బంధువుల్లో మేము నవ్వుల పాలు కాక తప్పదు! అందుకే ఇష్టం ఉన్నా, లేకున్నా తప్పకుండా ఈ పెళ్ళికి ఒప్పుకొని తీరేందుకే ఇంత కథ అని ఒక దృఢ నిశ్చయానికి వచ్చింది లత చాలా సేపటికి.

అలా ఆలోచిస్తూ పడుకుంది లత. కానీ, కంటికి కునుకు రాలేదు. చాలా సమయం గడిచిపోయింది. అప్పటికి నిద్దుర రాలేదు. లైట్‌ఆఫ్ చేసి గట్టిగా కళ్ళు మూసుకొంది. ఎప్పుడు నిద్దుర పట్టిందో ఆమెకే తెలియదు. సూర్యుని లేత కిరణాలు కిటికీ గుండా ఆమె ముఖంపై పడుతుంటే మెలుకువ వచ్చింది. గోడ గడియారం కేసి చూసింది. అప్పుడే ఏడు గంటలు దాటింది సమయం. బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంది లత.

'నిన్న రాత్రి కల గురించి తమ్ముకు చెప్పడమా? మానుకోవడమా? మళ్ళీ ఆలోచన- ఎడతెగని ఆలోచన అమ్మకు చెబితే మాత్రం ఏం చేయగలదు. నా మీది ప్రేమ చేత ఈ పెళ్ళి కాదని నాన్నను ఒప్పించగలదా అందుకు నాన్న ఒప్పుకుంటాడా? లేదు. ఒప్పుకోడు. అందుకే ఈ సంఘటన ఎవరికీ తెలియకూడదు. అన్నింటికి, అందరికి ఆ దైవమే కలదు. అతడు సర్వాంతర్యామి అని మనసులోనే మొక్కుకున్నది దేవునికి లత.

పెళ్ళి ముహూర్తం దగ్గర పడింది. నాలుగురోజులు గడువు మాత్రమే ఉంది.

లతకు పెళ్ళి చేస్తున్నామన్న గర్వంతో శాస్త్రి, అతని భార్య శాంత సంతోషంతో హుషారుగా ఉన్నారు. లత మనసెందుకో ఈ పెళ్ళంటే విముఖత చూపుతుంది.

తండ్రి మాట నెదిరించి ఈ పెళ్ళిని ఆపలేని అభాగ్యురాలు లత. అంతరాత్మ ఘోషిస్తున్నా, అదిమి పెట్టి నూతన వధువుగా అలంకరించుకుంది.

పెళ్ళంటే తన కిష్టమున్నట్లుగానే లత చిరునవ్వుతో కనిపించింది-మగ పెళ్ళివారు కోరిన కట్నకానుకలను యిచ్చి ఉన్నంతలో పెళ్ళి ఘనంగా జరిపించాడు శాస్త్రి.

పెళ్ళి తతంగం ముగిసిన తర్వాత బంధువులంతా లతను ఆశీర్వదించి, మరునాటి ఉదయం అత్తవారింటికి లతను పంపించడానికి సంసిద్ధులయ్యారు.

బిడ్డను అత్తవారింటికి పంపించడానికి శాంత మనస్సు తల్లడిల్లిపోయింది-లతను చూస్తున్నప్పుడు బాధతో-

కానీ !-ఆడపిల్ల-ఎన్నాళ్ళయినా - అత్తవారింటికి పంపాల్సిందే కదా ! అని మనసు రాయిచేసుకుంది. శాంత.

పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోవడానికి ముఖానికి అడ్డంగా చీరకొంగు నుంచింది. అయినా ఆమెకు దుఃఖము ఆగలేదు. లత తల్లి, దండ్రి అల్లుని, బిడ్డను, ఎట్టకేలకు దీవించి పంపారు. ఆ సమయంలో శాస్త్రి గుండె కరిగింది. కళ్ళల్లో నీరు సుడులు తిరిగింది. దుఃఖం పొంగి వచ్చింది. ఎంతటి వారికైనా ఈ ప్రేమ బంధం ఎంత శోభను కల్గిస్తుందోనని చూస్తున్నవారు అనుకుంటున్నారు.

పదిహేను రోజులు గడిచాయి. లతను పుట్టింటికి తీసుకొచ్చారు శాస్త్రి-అత్తవారింటి సంగతులన్నీ అడిగ తెలుసుకుంది లతను- శాంత- అప్పటికిని శాంత, శాస్త్రి మనసులు కుదుట పడలేదు. బిడ్డ సుఖంగా ఉన్నందుకు సంతోషపడ్డారిద్దరు.

వారం రోజులు గడిచిపోయాయి. అల్లునితో లతను పంపించారు.

"కూతురు లత నుండి ఉత్తరాలు వెళ్ళినప్పటి నుండి వస్తూనే ఉన్నవి." కూతురు క్షేమంగా ఉన్నట్లు తెలిసి, భార్యాభర్తలు ఇద్దరు అన్యోన్యంగా ఉన్నందుకు సంతోషపడ్డారు శాస్త్రి, శాంత.

"విజయ్ విదేశాలకెళ్ళి చదివొచ్చినా, అతనికి ఉద్యోగం చేయాలనే ఉద్దేశ్యం లేదు."

"ఎప్పుడూ టక్ వేసి నీటుగా ఉండే విజయ్, అందంగా పొడుగ్గా నాజూకుగా ఉంటాడు." అతని కావలసినంత చదువూ, అందం ఉన్నా గర్వమంతగా లేదు. డబ్బుకుకూడా కొదువలేదు." తల్లి తండ్రి కొక్కగానొక్క కొడుకు విజయ్. అతన్ని ఎవరూ పల్లెత్తు మాట అనరు. అందుకే 'బిజినెస్' చేస్తానన్నా ఇంటిలో ఎదురెవరు చెప్పలేదు."

"పెద్దఎత్తున పెట్టుబడిపెట్టి" వైన్ మర్చంట్ రామనాధంతో పొత్తుకుదిరి' "వైన్ షాప్"ను నడిపించుతున్నాడు విజయ్.

"రామనాథం" — చదువుకొన్నప్పటికి, నిరు ద్యోగిగా ఉంది. ఒక "షాప్"లో గుమాస్తాగాచేసి, (ప్రస్తుతం "షాప్‌లో వోనరయ్యాడు"- రామనాథానికి, విజయ్‌కు ఎక్కువ స్నేహం లేకున్నా, బిజినెస్ లైన్‌లో "పార్టనర్"గా చేరిపోయాడు విజయ్.

కాలం గడుస్తుంది. రామనాథం, విజయ్‌ల సార థ్యంలో 'బిజినెస్' బాగా నడుస్తుంది. దాంతో ఏడాది తిరిగే సరికల్లా హోల్ సేల్ వైన్‌షాప్ కూడా తెరి చారు విజయ్‌కు ఈమధ్య చాలా (ఫెండ్స్ అయ్యారు. విజయ్ సేల్స్‌మన్‌షిప్‌గా ఉంటూ టూర్స్ ఎక్కువ చేయడం జరుగుతుంది. చిన్న పట్టణాల కెళ్ళి ఆర్డర్స్ బుక్ చేసుకొస్తున్నాడు విజయ్.

బిజినెస్ పెరిగినట్లే విజయ్‌కు (ఫెండ్స్, దురల వాట్లు, పెరిగి పోయినవి. డబ్బును కూడ ఎక్కువ విలాసాలకోసం ఖర్చు చేసెడివాడు. దుర్వ్యసనాలతో ఇంటిని, భార్యను అప్పుడప్పుడు మరిచేవాడు విజయ్.

విజయ్ (ఫెండ్స్‌తో (తాగి తందనాన లాడుతుంటే చూసిన రామనాథం మందలించి, బుద్ధి చెప్పి, మంచి దారిలో పెట్టాలని (ప్రయత్నించాడు.

(తాగుబోతు, జూదరి, వ్యభిచారిగా మారిన విజయ్‌ను మార్చడం చేతగాక రామనాథం తన (ప్రయత్నానికి స్వస్తిచెప్పాడు.

విజయ్ రాకకోసం లత ఎదురుచూపులు ఉపవా సాలు, భర్తలో మార్పు వస్తుందని ఆశించడాలు తప్ప లేదు లతకు.

తప్పు(తాగి, తూలిపడుతూ, రాత్రిపొద్దుపోయి ఇంటికి చేరవచ్చే భర్తకు స్వాగతం పలకడం ఆమె దినచర్యలో చివరిఘట్టం.

భార్యపట్ల, అసభ్యతగా (ప్రవర్తిస్తూ, నోటికొచ్చి నట్లు దుర్భాషలాడుతుంటే సహించలేక ఎదురు చెప్పి నందుకు, ఆమెను నానా చిత్రహింసలు పెట్టేవాడు విజయ్.

ఇదేమిటని ! (ప్రశ్నించితే ! నేను మొగవాడిని. (తాగుతాను. నాయిష్టం వచ్చినప్పుడు, నా యింటికి వస్తాను- నీవు నోరు మూసుకొని పడిఉండాల్సిందని శాసించే, భర్త (ప్రవర్తనకు నొచ్చుకున్న లతగుండె బాధతో కూరుకుపోయింది.

లత జీవితం-నరక కూపమైంది-నోరుండీ మాట్లాడ లేని మూగజీవి. ఎదురు చెప్పలేని నిస్సహాయురాలు-

సహనం కోల్పోయి ఒకనాడు విజయ్‌ను లత నిలదీసింది. నీ (ప్రవర్తనలో చాలా మార్పు వచ్చిందని (ప్రశ్నించింది. అందుకు సమాధానం రాలేదు. కానీ! చెంప చెళ్ళుమంది. గుండె ఒక్కసారి పగిలింది- శోకం కట్టలు తెంచుకొని (ప్రవహించింది.

దెబ్బతిన్న ఆడపాములా కోపంతో రెచ్చిపోయింది లత. చిత్రహింసలను భరించలేని లత భర్తకే ఎదురు తిరిగింది.

లత మనసులో (ప్రేమ ఏనాడో చచ్చింది ఇప్పు డామె జీవచ్ఛవం.

మతం, కులం, ఆచారం, సాం(ప్రదాయమంటూ గొంతుకొసే కన్నతం(డులంటే లతకు అసహ్యం.

సాం(ప్రదాయం పేరుతో గుణం తెలుసుకోలేక కట్ట బెట్టిన కాపురాలు శాస్త్రిలాంటి గుండెల్లో చిచ్చురేపి, కన్నబిడ్డల తలరాతలు, విధివంచిత జీవితాలు శాస్త్రి లాంటి తం(డుల గుండెల్లో క్షోభను కల్గించక మానవు అని మదన పడిందామె హృదయం.

లత హృదయం విజయ్‌తో కలిసి కాపురం చేసేం దుకు ఒప్పుకోవడం లేదు. మనసు చంపుకొని జీవించ లేని లత, భర్తను మార్చలేక విఫలమైన లత, ఈ నరక కూపంనుంచి విముక్తికై ఆరాట పడుతుంది.

తన కళ్ళముందే మరో స్త్రీతో కులికే భర్తను ఈ సమాజంలో ఏ స్త్రీ సహించదు—అలానే లత కూడ సహించలేదు. అతనికి అడ్డుచెప్పినందుకు, అతడిని మార్చాలని చూసినందుకు, మెడబట్టి గెంటివేయడమే భర్తచేసిన సత్కారమైంది లతకు.

ఎదురు తిరిగిన వనిత ఎవరికి భయపడదంటారు-అలానే సహనం కోల్పోయి, జీవితంలో సుఖాన్ని వదలుకొని జీవించలేక, యముడి లాంటి భర్తకు గుణపాఠం చెప్పాలనుకుంది-లత.

నీచుడా, దుర్మార్గుడా, నీలో మార్పు వస్తుందనీ, నీవు నన్ను మనసారా ప్రేమించావని నమ్మిమోసపోయాను.

అందుకే ! నీనుండి దూరంగా వెళ్ళాలని నిశ్చయించుకొన్నాను. ఇదిగో ! నీవు కట్టిన ఈ పసుపు త్రాడు "మంగళసూత్రం కాదు", నా మెడకు తగిలించిన "పలుపు త్రాడు-నా జీవితానికిది ఒక "ఉరి త్రాడు"- అందుకే ఇది నా మెడలో ఉండకూడదని మంగళ సూత్రాన్ని తెంపి, విజయ్ వంక విసరివేసి, పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకొని అడుగు ముందుకేసింది లత.

తాగిన మైకం కాస్త దిగింది విజయ్‌కు. లత వెళుతున్న వైపు దీనంగా చూస్తుండిపోయాడు.

టీచర్,
తా: హుస్నాబాదు,
జి: కరీంనగర్-505467.

# మనవి

1. "స్రవంతి మాస పత్రికకు" చందా కట్టునపుడుగాని, ఉత్తర ప్రత్యుత్తరములు జరుపునపుడుగాని దయచేసి తమ చందానంబరు తప్పక పేర్కొనగలరు.
2. "స్రవంతి" చందా 10-00 రూ॥ల నుంచి 15-00 లకు పెంచబడినది. కావున 10-00 చందాకట్టినవారు మిగతా 5-00 పంపగలరు.

ఇట్లు
సంపాదకులు



# ఆదర్శమూర్తి శ్రీ మండలి

శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి పేరు చెప్పగానే ఎవ్వరికైనా స్ఫురించేవి-గాంధేయ సిద్ధాంతాలు, సమాజసేవ లక్ష్యాలు, నిరాడంబర విధానాలు. త్రివేణీ సదృశమైన ఈ ఆదర్శ వాహినీత్రయం ఆయన జీవితంలో అంతర్నిహితమై ప్రజా శ్రేయస్సంక్షేమ సాధనవైపు పురోగమింప చేస్తున్నాయి. మనసా వాచా, కర్మణా శ్రీ మండలి గాంధీ అనుయాయి. నిజమైన సంఘసేవకుడు. నిరాడంబరత మూర్తీభవించిన వ్యక్తి రాజకీయంగా ఆయనను విమర్శించే వారు సయితం ఈ పరమసత్యాలను బాహాటంగా అంగీకరిస్తారు. చిత్తశుద్ధి, నిజాయితీ ఆయనకు తరగని సంపద. మంత్రిగా పదవీ స్వీకారం చేసిన వెంటనే ఆయన తమ ఆస్తిపాస్తులను వెల్లడించి క్రొత్త సంప్రదాయాలను నెలకొల్పారు. శ్రీ మండలి నిగర్వి, ఆయనలో వినమ్రత ఉద్దీపడుతుంది. భేషజానికి నిదర్శనంగా ఉంటుందని భావించి పూలదండలు స్వీకరించబోనని ప్రకటించి, మిత్రులు, అభిమానులు ఎందరో ఎన్నోవిధాల ఒత్తిడి తెచ్చినప్పటికి లొంగక తమ ఆశయానికి కట్టుబడి ఉన్నారు. ఆయనలోని నిరాడంబరతకు పరాకాష్ఠగ పేర్కొనతగినది బస్సు ప్రయాణం. ఏదో లాంఛనంగా ఒకసారి వెళ్లిరావడంగా కాక; ఆయన వీలైనప్పుడల్లా దూరప్రయాణాలు బస్సులలో సాగించడం నియమంగా పెట్టుకొన్న ఆదర్శమూర్తి. పాలనా బాధ్యత వహించే వారికీ ప్రజలకూ మధ్య సాన్నిహిత్యం పెంపొంది అవినాభావ సంబంధం ఏర్పడాలన్నది శ్రీమండలి ఆకాంక్ష.

**త్యాగనిరతి :**

ప్రధానంగా శ్రీ మండలి ప్రజాసేవకులు. పదవి కోసం ఎప్పుడూ ఆయన తాపత్రయపడలేదు. ఆయన నిస్స్వార్థ సేవానిరతి కార్యదక్షత కారణంగా పదవులే ఆయనను వరించాయి. అయితే పదవివున్నా లేకున్నా శ్రీ మండలి, మండలిగానే ఉండటం గమనార్హం. ఏ పదవినైనా ఆయన ఒక బాధ్యతగా స్వీకరించటం పరిపాటి. ప్రజాశ్రేయస్సుకు దోహదంచేసే వేదికగా భావించారే గాని పేరు ప్రతిష్ఠల్ని సంపదను సమకూర్చే సాధనంగా తలచలేదు. ప్రజాజీవితంలో ఆయన అహరహం త్రికరణ శుద్ధితో కృషిచేసి సోపానక్రమంలో పురోగమించి జనహృదయ సీమలలో ఉన్నత స్థానం సమకూర్చుకున్నారు. ఎట్టి పరిస్థితులలోను ఇతరులను నొప్పించని మనస్వి. రాజకీయ ప్రత్యర్థుల పట్ల ఆయన చూపే సౌహార్దం వారిని నిరుత్తరులను చేయక మానదు. బలహీన వర్గాల ప్రజలపట్ల శ్రీ మండలి కనబరచే సహానుభూతి ఆయన సౌజన్యానికి తార్కాణం. దేశ ప్రగతి వల్ల చేకూరే సత్ఫలితాలు బడుగు ప్రజలందరకూ అంది వారి జీవితాలు

సుఖప్రదం కావాలని, వారందరూ జాతి భవితవ్యాన్ని తీర్చిదిద్దటంలో ఇతోధిక పాత్ర వహించాలని శ్రీ మండలి ఆకాంక్ష. వినోబాజీ భూదానోద్యమానికి ఉత్తేజితులై స్వాతంత్ర్య సమరయోధుడుగ తనకు యిచ్చిన అయిదెకరాల భూమిని హరిజనులు, తదితరులైన పేదకుటుంబాలవారికి పంచియివ్వగలిగిన మానవతావాది ఆయన. అప్పటినుండి ప్రతిఫలాన్ని ఆశించని స్వాతంత్ర్య సమరయోధుడు.

## జననం విద్యాభ్యాసం :

శ్రీ మండలి వెంకట కృష్ణారావు 1926 ఆగస్టు 4వ తేదీన కృష్ణాజిల్లా, కైకలూరు తాలూకా పల్లెవాడ గ్రామంలో జన్మించారు. వారిది సామాన్య కుటుంబం. తల్లి మహంకాళమ్మగారు. తండ్రి వెంకట్రామయ్య గారు. దివితాలూకా భావదేవరపల్లిలో ఉపాధ్యాయులుగా ఉండేవారు. పల్లెవాడ, భావదేవరపల్లి గ్రామాలందు ప్రాథమిక విద్య పూర్తిచేసిన మీదట శ్రీ మండలి అవనిగడ్డ ఉన్నత పాఠశాలలో చదివి 1945లో ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. తరువాత మచిలీపట్నం హిందూ కాలేజీలో ఉన్నతవిద్య నభ్యసించారు.

## సేవారంగ ప్రవేశం :

పదిహేను సంవత్సరాల ప్రాయంలోనే 1941లో శ్రీ మండలిని గాంధీజీ ప్రబోధాలు ప్రభావితంచేశాయి. ఆయనలో జాతీయ భావాలు పెల్లుబికాయి. అవే ఆయన రాజకీయ జీవితానికి శ్రీకారం చుట్టాయి. 1942లో జాతీయ విద్యార్థి సంఘంలో క్రియాశీలి సభ్యులుగాచేరి ఆయన "క్విట్ ఇండియా" మహోద్యమంలో పనిచేశారు. లాఠీచార్జి చేయబడి ఆరెస్టు అయినారు. జాతీయ విద్యార్థి సంఘం అవనిగడ్డశాఖకు శ్రీ మండలి అధ్యక్షులుగా ఉండి దానిని అతి సమర్థతతో నడిపారు. కాంగ్రెసుపై ఆంక్షలు విధించినపుడు ఆయన దివితాలూకా కాంగ్రెసు సమితి సంచాలకులుగా రహస్యంగా కార్యకలాపాలు నిర్వహించారు. 1945లో శ్రీ మండలి జిల్లా విద్యార్థి కాంగ్రెసు నిర్వాహక కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఆ సంవత్సరం అవనిగడ్డలో రెండువారాల పాటు ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ పౌర సత్వ కళాశాలను నడిపారు. 1946లో డిటెన్షన్ వ్యతిరేకోద్యమంలో పాల్గొని శ్రీ మండలి లాఠీ దెబ్బలకు గురి అయ్యారు. 1948లో ఢిల్లీలో జరిగిన ఆసియా విద్యార్థి మహాసభలలో శ్రీ మండలి మద్రాసు రాష్ట్రం నుంచి ప్రతినిధిగా పాల్గొన్నారు.

## యువజన నాయకుడుగా :

యువకులుగా శ్రీ మండలి ప్రదర్శించిన నిర్వహణ దక్షత నాయకుల ప్రశంస అందుకున్నది. 1948-52 మధ్య కృష్ణాజిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షులుగా ఆయన యువకులను కాంగ్రెస్ అడుగుజాడలలో నడిపించారు. అవనిగడ్డలో సేవాదళ కార్యక్రమాలు చేపట్టి ఆయన జయప్రదంగా అమలుజరపటం జరిగింది. రాయలసీమ క్షామబాధితులకోసం నిధి వసూలు చేసి వారికి సహాయం అందచేశారు. పెక్కు ప్రాంతాలలో మహాసభలు జరిపి యువజనులలో నవజాగృతి కలిగించారు. 1952 నుంచి 56 వరకు జిల్లాకాంగ్రెసు సంయుకార్యదర్శిగా శ్రీ మండలి కృష్ణా జిల్లా కాంగ్రెస్ సంస్థలో నూతన చైతన్య స్ఫూర్తిని ఉద్దీపింపజేశారు. తదనుగుణంగా శిక్షణ శిబిరాలు చాలచోట్ల ఏర్పాటు అయ్యాయి.

శ్రీ మండలి ఒక వైపు కాంగ్రెసు సంస్థనుపటిష్ఠం చేస్తూ మరొకవైపున రైతాంగానికి శాయశక్తులా తోడ్పాటు నందిస్తూ వచ్చారు. ఆంధ్రరాష్ట్ర బంజరు రైతుల మహాసభ ఏర్పాటుచేసి వారి సమస్యలను సాకల్యంగా చర్చించి ప్రభుత్వానికి తగు పరిష్కార మార్గాలు సూచించారు. శ్రీ మండలి కృషి ఫలితంగా బీదలకు బంజరు భూములు పంచే కార్యక్రమం

1955 లో ప్రారంభమైంది. దివి సీమ ప్రాంతంలో పదిహేను వేల ఎకరాల బంజరు భూములను పేద వారికి ఇప్పించిన ఘనత ఆయనకే దక్కింది.

## కార్యకర్తగా

శ్రీ మండలి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సంయుక్త కార్యదర్శిగా నియమితులై 1958 వరకు ఆ పదవిని అత్యంత సమర్థతతో నిర్వహించారు. ప్రదేశ్ కాంగ్రెస్‌కు చెందిన నిర్మాణాత్మక కార్యక్రమ సంఘానికి, భూదాన యజ్ఞ సంఘానికి నిర్వాహకులుగా పనిచేశారు. ప్రజలనుంచి విరాళాలు సేకరించి మచిలీపట్నంలో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య షష్టిపూర్తి సందర్భంగా జిల్లా కాంగ్రెస్ సంఘ భవనంపై హాలు నిర్మాణానికి శ్రీ మండలి కారకులయ్యారు.

## వివిధ రంగాలలో

ఆయన కార్యరంగం జాతీయస్థాయికి విస్తృతమైంది. 1957 లో మచిలీపట్నం నియోజక వర్గం నుంచి లోక్‌సభ సభ్యులుగా శ్రీ మండలి ఎన్నిక అయ్యారు. సేవా తత్పరతతో రాష్ట్ర అభ్యుదయానికి జాతీయ శ్రేయస్సుకూ దోహదకరమైన కృషిచేసి అందరి మన్ననలకు పాత్రులయ్యారు. 1963-69 మధ్య ఆయన కృష్ణా జిల్లా పరిషత్తు ఉపాధ్యక్షులుగాను, ఆహారోత్పత్తి సంఘం అధ్యక్షులుగాను పని చేశారు. కృష్ణా జిల్లాలో వ్యవసాయాభివృద్ధికి గైకొనవలసిన వివిధ చర్యలను గురించి శ్రీ మండలి ప్రభుత్వానికి సమగ్రమైన నివేదిక సమర్పించారు. 1970లో అవనిగడ్డ పంచాయతీ సమితి అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1969 నుంచి 72 వరకు శ్రీ మండలి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శిగా నిర్విరామంగా అకుంఠిత దీక్షతో పని చేసి ఆ సంస్థను పటిష్టం చేశారు. లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో రాష్ట్రంలో ఘనవిజయం సాధించేందుకు శ్రీ మండలి నిర్విరామంగా కృషి చేశారు. ఆయన 1954 నుంచి అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యులుగా పని చేస్తున్నారు.

## నిర్మాణ కార్యక్రమంలో

మహాత్ముని శతజయంత్యుత్సవాల సందర్భంగా శ్రీ మండలి అవనిగడ్డలో "గాంధీ క్షేత్రం" నిర్మింపజేశారు. గాంధీ నిర్మాణ కార్యక్రమానికి ఉత్తమ వేదికగా ఈ క్షేత్రం రూపొందుతున్నది. దివిసీమను దివ్యసీమగా పెంపొందించిన ఖ్యాతి శ్రీ మండలికి చెందడం సముచితం. ఈ ప్రాంతంలో ఆయన సహకార సేద్య బృహత్ప్రణాళిక, మత్స్య పరిశ్రమాభివృద్ధికి సంబంధించిన అనేక ప్రణాళికలు రూపొందించారు.

శ్రీ మండలి ప్రజాహిత సేవారంగం బహుముఖమైనట్టిది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ ఆంధ్రప్రదేశ్ మత్స్య పరిశ్రమాభివృద్ధి సంఘ మండలి సభ్యులుగా అమూల్య సేవ చేశారాయన. 1970 సెప్టెంబరులో ఆగ్నేయ ఆసియా దేశాలు పర్యటించారు.

## సంక్షేమ మంత్రిగా

నిస్వార్థ సేవకు మారుపేరుగా నిలిచిన శ్రీ మండలి 1972 లో జరిగిన సార్వత్రిక ఎన్నికలందు ఆంధ్రప్రదేశ్ శాసనసభకు అవనిగడ్డ నియోజక వర్గం నుంచి పోటీ లేకుండా ఎన్నిక కావడం ఆయన పట్ల ప్రజా బాహుళ్యాని కున్న ఆదరాభిమానాలకు నిదర్శనం. శ్రీ పి.వి. నరసింహారావు గారి మంత్రివర్గంలో ఆయన సాంఘిక సంక్షేమ, మత్స్య పరిశ్రమ శాఖల మంత్రిగా పదవీ స్వీకారం చేశారు. 1973 జనవరిలో రాష్ట్రపతి పాలన విధించే వరకు ఆ శాఖలను శ్రీ మండలి ఎంతో దీక్షతో నిర్వహించారు. స్వల్ప వ్యవధిలోనే ఆయన బడుగువర్గాల శ్రేయోభివృద్ధి నిమిత్తం ఎన్నో అభ్యుదయ కార్యక్రమాలు

అమలు పరిచారు. సాంఘిక సంస్కరణ పయిన ఒక సదస్సును, మత్స్య పరిశ్రమాభివృద్ధి పయిన ఒక సదస్సును ఏర్పాటు చేశారు. సాంఘిక సంక్షేమం కోసం ప్రత్యేక సచివాలయ శాఖను ఏర్పరచేందుకు హరిజనులు, వెనుకబడిన తరగతుల వారి కోసం ఆర్థిక సహాయ సంస్థలు నెలకొల్పేందుకు సంబంధించిన ప్రతిపాదనలకు శ్రీ మండలి రూపకల్పన చేయడం జరిగింది. వర్ణాంతర వివాహాలకు ప్రభుత్వపరమయిన ప్రోత్సాహం లభింపచేసే కార్యక్రమానికి నాంది ఏర్ప రచింది శ్రీ మండలి గారే. ప్రైవేటుహాస్టళ్ళ నిర్వహణలో ఉండే అవినీతిని రూపుమాపి, హాస్టళ్ళను ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు తెచ్చేందుకు శ్రీ మండలి పట్టుదలతో కృషి చేశారు. హరిజనులకు ఇళ్ళ స్థలాలు కేటాయించే కార్యక్రమాన్ని సత్వరపరచి భారత జీవిత భీమా సంస్థ ఆర్థిక సహాయంతో హరిజనుల కోసం వసతివాడలను నిర్మింపచేశారు. శ్రీ మండలి ఆధ్వర్యంలో సాంఘిక సంక్షేమ, మత్స్య పరిశ్రమ శాఖలు కొత్త రూపు రేఖలను సంతరించుకొని శక్తిమంతమయ్యాయి.

## సమైక్యతా వీరుడు

రాష్ట్ర విభజన కోరుతూ తీవ్ర ఆందోళన ముమ్మరంగా చెలరేగి ప్రతిఘటన పతాక స్థాయిలో వున్నప్పటికి శ్రీ మండలి మేరునగధీరులై సమైక్యతా లక్ష్యం పట్ల అచంచల విశ్వాసంతో, వజ్ర సంకల్పంతో ప్రతీప శక్తులను ఎదుర్కొని రాష్ట్ర సమైక్యతా పరిరక్షణకు కారకులయ్యారు.

## విద్యామంత్రిగా

రాష్ట్రపతి పాలన అనంతరం శ్రీ జలగం వెంగళరావు నాయకత్వాన నూతన మంత్రివర్గం ఏర్పడినప్పుడు శ్రీ మండలి వెంకట కృష్ణారావు విద్యా, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిగా పదవీ స్వీకారం చేశారు. ఈ నూతన బాధ్యత చాలా గురుతరమైనట్టిది. ఆయన సవినయంగా తెలియపరుస్తూ శక్తివంచన లేకుండా కృషి చేయగలనని వాగ్దానం చేశారు. రాష్ట్ర విద్యాశాఖను పునర్వ్యవస్థీకరించి దానిని శక్తిసంపన్నం చేసేందుకు శ్రీ మండలి కృత నిశ్చయులై కృషి సాగించారు. విద్యా విధానం పైన ఒక సదస్సు ఏర్పాటు చేసి అభిజ్ఞుల సూచనలను పొందారు. ప్రభుత్వ పరీక్షలలో జరుగుతున్న అక్రమ విధానాలను అరికట్టేందుకు సంచార తనిఖీ బృందాల ఏర్పాట్లు మొదలైన చర్యలు గైకొన్నారు. దానితో పాటు విద్యార్థులతో ముఖాముఖీగా మాట్లాడి ఇటువంటి అక్రమ విధానాలు వారికే హానికరమని నచ్చచెప్పారు. నిష్పక్షపాతం గాను, క్రమశిక్షణాయుతంగాను పరీక్షలు జరపడం అవసరమని విద్యార్థిలోకం అంగీకరించింది. చిరకాలంగా ఉపాధ్యాయులనుఎదుర్కొంటున్న పెక్కు సమస్యలను సమర్థతతో పరిష్కరించి వారి అభిమానాన్ని చూరగొన్నారు. శ్రీ మండలి తలపెట్టిన సంస్కరణలకు అభివృద్ధికర కార్యక్రమాలకు సర్వదా ముఖ్యమంత్రి గారి అండదండలు లభించడం ముదావహమైన విషయం. నాగార్జున, కాకతీయ విశ్వవిద్యాలయములను ఏర్పాటు చేశారు.

## సాంస్కృతిక రంగంలో

ముఖ్యంగా సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ మండలి తెలుగు సీమలోనే గాక యావద్భారత దేశంలో కూడా నూతన చైతన్యం వెల్లివిరియజేశారు. సాంస్కృతిక రంగంలో కనీవినీ యెరుగని ఆనందోత్సాహాలు జనించాయి. 1974 లో అఖిల భారత తెలుగు సాంస్కృతికోత్సవాలు, అఖిల భారత తెలుగు మహోత్సవాలు విజయవంతంగా నిర్వహించి సాటిలేని కార్యదక్షతను నిరూపించారు. 1975 ఏప్రిల్‌లో హైదరాబాదుతో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల ఆహ్వానసంఘ కార్యనిర్వాహక అధ్యక్షులుగా దివారాత్రాలు శ్రమించి ప్రతి అంశం పట్ల వ్యక్తిగతంగా

శ్రద్ధ చూపి ఎవరూ ఊహించనంతటి విజయాన్ని సాధించిన ధీశాలి? కార్యశీలి శ్రీ మండలి అంతర్జాతీయ తెలుగు సంస్థను, రాష్ట్రంలో బాలల అకాడమీని, హైదరాబాదులో శాశ్వత ప్రాతిపదికపై "తరతరాల తెలుగుజాతి" అనే ప్రదర్శనను నెలకొల్పేందుకు ఆయన కృషిచేశారు

1981 లో అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షులుగా నియమితులై మలేషియాలో ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభల సూత్రధారియై నిర్వహణకు ఏర్పాట్లు చేశారు.

## సమాజసేవ

1977 నవంబరులో వచ్చిన ఉప్పెన, తుఫాను భీభత్స సమయంలో రక్షణ సహాయ, పునరావాస, పునర్నిర్మాణ కార్యక్రమాలలో శ్రీ కృష్ణారావు చేసిన కృషి జగద్విఖ్యాతి చెందినది. సేవాసంస్థలు, ప్రజలు, అధికారులను సమన్వయ పరచుకొంటూ వారు చేసిన సేవా కార్యక్రమాల వల్లనే ఉప్పెనచే సర్వనాశనమైన ప్రాంతము త్వరలో కోలుకొని సర్వసౌకర్యాలతో అలరారుచున్నది. గాంధీక్షేత్రానికి అనుబంధంగా సేవాశ్రమాన్ని స్థాపించి ఉప్పెన వలన నిరాధారులైన పిల్లలను పోషిస్తూ గాంధీ గురుకులంలో వారికి విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తున్నారు. గాంధీక్షేత్రంలో హిందీ ప్రచారక విద్యాలయం, కుట్టు శిక్షణా కేంద్రం, అద్దకం శిక్షణా కేంద్రం, మత్స్య పారిశ్రామికుల పిల్లలకు ఆశ్రమ పాఠశాల, బాలబాలికల వృత్తివిద్యాలయం, వయోజన పాఠశాలలు మొదలగు సంస్థల ద్వారా నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరుపుచున్నారు. స్వచ్ఛంద సేవా సంస్థల సహకారంతో పదివేల యిండ్లు కట్టించారు.

దక్షిణ భారత నిర్మాణ కార్యకర్తల మహాసభలు, ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల, సంఘ సేవకుల మహాసభలు నిర్వహించి, నిర్మాణ కార్యకర్తలలో నూతన ఉత్సాహాన్ని సాధించడానికి కృషి చేశారు. వారి సేవలకు గుర్తింపుకు 1977-78సంవత్సరములో ఉత్తమ సహజ సేవకునికి లభించే ప్రభాకర్‌జీఅవార్డు ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల, సమాజ సేవకుల సంఘం శ్రీ రావుకి బహూకరించింది. వారి సేవలకు ఇది చిన్న గుర్తింపు మాత్రమే.

1982 నవంబరులో శ్రీ విజయభాస్కరరెడ్డిమంత్రి వర్గంలో సహకార శాఖామంత్రిగా నియమితులయి సహకారోద్యమాన్ని ప్రజల ఉద్యమంగా రూపొందించడానికి కృషి జరిపారు.

గాంధీజీ తరువాత అంతటి మహనీయ వ్యక్తిగా భారతదేశం పూజించిన వినోబాజీ పరమపదించగా రావు గారు వార్ధా వెళ్ళి వారి అంత్యక్రియలలో పాల్గొన్నారు. భూదానోద్యమానికి జన్మస్థలమైన పోచంపల్లిలో 22-11-1982 నాడు జరిగిన వినోబాజీ శ్రద్ధాంజలి సభలో రావు ఏటా తన ఆదాయంలో 6 వ వంతు దీనజనోద్ధరణకు ఖర్చు పెడతానని ప్రకటించారు. ఆ రూపంగా వినోబాజీ ప్రతిపాదించిన సంపత్తిదాన సూత్రాన్ని స్వీకరించరు-

1983 జనవరిలో జరిగిన సాధారణ ఎన్నికలలో అవనిగడ్డ నియోజకవర్గం నుండి శాసనసభకు తిరిగి ఎన్నికయి ప్రజాసేవకు పునరంకితం అయ్యారు. 1985 లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసుసంఘానికి ప్రధాన కార్యదర్శిగ నియుక్తులై రాష్ట్రంలో కాంగ్రెసు పునరుజ్జీవనానికి కృషిగావిస్తున్నారు.

## విదేశ యాత్రలు

1976 లో ద్వితీయ విశ్వ హిందీ మహాసభకు భారత ప్రతినిధి వర్గంలో సభ్యులుగ శ్రీ రావు మారిషస్ వెళ్ళారు. మారిషస్ దేశమంతా విస్తృతంగా పర్యటించి తెలుగువారిలో ఉత్సాహాన్ని కలిగించారు. మారిషస్ ప్రధాని సర్ శివసాగర్ రామగులామ్‌ను కలుసు

కుని మారిషస్ తెలుగు వారికి ఆంధ్రప్రదేశ్‌కి మధ్య సదవగాహన కల్పించారు.

1979 లో మలేషియా వెళ్ళి ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలకు ఏర్పాట్లు గావించి దక్షిణాది తెలుగు వారున్న గ్రామాలు తిరిగి ఉత్సాహపరిచారు.

1988 సెప్టెంబరులో బ్రిస్టల్ ఇండియన్ అసోసియేషన్ వారి ఆహ్వానంపై ప్రముఖ సంఘ సంస్కర్త శ్రీ రాజా రామమోహన్‌రాయ్ వర్ధంత్యుత్సవాలలో పాల్గొన్నారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని యు.కె: యూరప్; యు.ఎస్.ఎ; కెనడా దేశాలలో పర్యటించి 1977 లో దివిసీమలో సంభవించిన పెను ఉప్పెన, తుఫాను ప్రమాదంలో చిక్కుకున్న వేలాది మందికి సహాయ పునరావాస కార్యక్రమాలు నిర్వహించిన అంతర్జాతీయ స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులను స్వయంగా కలసి కృతజ్ఞతలు తెలియజేసినారు. ఆయా దేశాల లోని తెలుగువారితో వారివారి విద్యా సాంస్కృతిక సమస్యలను చర్చించటమే కాక తెలుగు భాషా సంస్కృతుల పట్ల వారి అభిమానాన్ని ఉత్తేజ పరచారు. నేడు ప్రపంచాన్ని చుట్టుముట్టుతున్న అనేక క్లిష్టసమస్యలపరిష్కారానికి మహాత్మాగాంధీఅహింసా సిద్ధాంతమే శరణ్యమని పాశ్చాత్యులకు చాటి చెప్పారు.

1984 ఏప్రియల్‌లో మలేషియా తెలుగు సంఘం ఆహ్వానంపై సతీసమేతంగా మలేషియా వెళ్ళి ఉగాది ఉత్సవాలలో పాల్గొన్నారు. తెలుగువారున్న వివిధ ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించి అనేక సభలలో ప్రసంగించి తెలుగువారిని ఉత్తేజపరిచారు. ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు మలేషియాలో జరుగుటకు కారణభూతులని, విశ్వవ్యాప్తంగా ఉన్న తెలుగు వారిని ఒక వేదిక మీద సమావేశపరచిన మహా మనీషిగా మలేషియా ఆంధ్రులు శ్రీ రావుని ఘనంగా సత్కరించినారు. "తెలుగుదాత" అని ప్రశంసించారు.

## ప్రజల మనిషి

నవసమాజ స్థాపనాధ్యేయం, అకుంఠిత దీక్ష, ధైర్యసాహసాలు, క్రమశిక్షణ, త్యాగనిరతి, సేవా తత్పరత, చిత్తశుద్ధి, నిరాడంబరత మూర్తీభవించిన శ్రీ రావు విరామ మెరుగని కార్యశూరులు. ఆయన ప్రజల మనిషి. మృదుభాషి. స్వపర వర్గభేదాలు ఎరుగని ఆదర్శ నాయకులు శ్రీ మండలి. ఆయన ధర్మపత్ని శ్రీమతి ప్రభావతి దేవి భర్తకు ప్రజాహిత కార్యక్రమాలలో చేదోడు వాదోడుగా వుండే ఆదర్శ గృహిణి. శ్రీ రావు దంపతులకు ఇద్దరు కుమారులు- చిరంజీవులు బుద్ధ ప్రసాద్, సత్యప్రసాద్. ఇద్దరు కుమార్తెలు- చిరంజీవులు అన్నపూర్ణా దేవి, రేవతి

జీవితంలోనూ, సమాజ దృక్పథంలోనూ, ప్రభుత్వ పాలనలోనూ, గాంధేయ సిద్ధాంతాలకూ, ఆదర్శాలకూ అత్యంత ప్రాధాన్యమిచ్చి వాటిని ఆచరణలో పెట్టే ఆదర్శమూర్తి శ్రీ మండలి వెంకట కృష్ణారావు.

# జ్ఞానపీఠ బహుమతి గ్రహీత
# స్వర్గీయ శ్రీ మాస్తి వేంకటేశ అయ్యంగారు

డా॥ కర్ణ రాజశేషగిరిరావు

భారతీయ సాహిత్యంలో ప్రతిభా సంపన్నులుగా, ప్రజ్ఞా ధురంధరులుగా, సరస్వతీ పుత్రులుగా వెలుగు నొందే సాహితీవేత్తలను గౌరవించి, వారి సాహిత్యపు టౌన్నత్యాన్ని గుర్తించి, దేశ సమైక్యాన్ని పరిరక్షించి, భారతీయ సంస్కృతిని పునరుద్ధరించాలనే ఉద్దేశ్యంతో జ్ఞానపీఠ బహుమతి ఏర్పాటు చేయబడింది. కన్నడ సాహిత్యానికిట్టి బహుమతి లభించడం నాలుగవసారి. శ్రీ కె. వి. పుట్టప్పగారికి 1967లో రామాయణ దర్శనం అనే మహాకావ్యానికి; శ్రీ దత్తాత్రేయ రామచంద్ర బేంద్రేగారికి 1973లో శ్రీ 'నాకు తంతి' అనే కావ్యానికి; శ్రీ కె. శివరామ కరంత్ గారికి 1977లో 'మూజ్జియ(శ్రీ)'కనసుగళు అనే నవలకు ఈ బహుమతి లభించింది. జ్ఞానపీఠ బహుమతి గ్రహీతలలో శ్రీ మాస్తి వేంకటేశ అయ్యంగారు 19వ వారు.

1891లో శ్రీ అయ్యంగారు కోలారు జిల్లాలోని మొంగెనహళ్లి'లో జన్మించారు. ఈయన చదువు సంధ్యలు శివరామపట్టణం, మైసూరు, బెంగుళూరు, మద్రాసులో జరిగాయి ఈయన మాతృభాష తమిళం. ఈయనకు తెలుగు, కన్నడం, తమిళం మొదలైన భాషలు బాగా తెలుసును. 1914లో మైసూరు ప్రభుత్వంవారి సివిలు సర్వీసు ఉద్యోగంలో చేరి 1948లో రిటైరు అయినారు. ఆయన సేవకు గుర్తింపుగా "రాజసేవా ప్రశక్త" బిరుదుకూడా ఇచ్చారు. సర్వీసులో ఉన్నంతకాలం పేరు ప్రతిష్ఠలను ఆర్జించి వీలయినంత వరకు ప్రజోపయోగకరమైన పనుల నొనరించి ప్రజల మన్ననలను పొందారు. మాతృభాష తమిళం అయినా కన్నడ భాషలో బహు గ్రంథాల్ని రచించి కన్నడ సాహిత్యాభివృద్ధికి తోడ్పడ్డారు. ఆయన శ్రీనివాస అనే కలంపేరుతో ప్రసిద్ధులు ఆయన మొత్తం 118 గ్రంథాలను రచించారు. ఆయన రచనల్లో 17 కవితా సంపుటాలు, 18 నాటకాలు, 8 నవలలు, 17 కథలు, అనేక జీవిత చరిత్రలు, విమర్శనాత్మక గ్రంథాలు దాదాపు 26 ఉన్నాయి. వారి రచనలలో పునర్వికాస ధోరణులు ఎక్కువగా కన్పిస్తాయి. శ్రీ అయ్యంగారు నవలాకారుడే కాక-కవి, కథకులు, నాటక కర్త కూడా. సాహిత్యసేవకు గుర్తింపుగా ఆయనకు అనేక అవార్డులు లభించాయి. దీనిలో సాహిత్య అకాడమీ అవార్డు ఒకటి. 'చికవీర రాజేంద్ర' అనే నవలకు జ్ఞానపీఠం 1983లో అవార్డును ప్రసాదించింది.

ఈ నవలను స్వాతంత్ర్యానంతరం వెలువడిన అత్యుత్తమ నవలగా అభివర్ణించింది,

20వ శతాబ్దం ప్రారంభం కావడంతో కన్నడ సాహిత్యంలో అధునిక యుగం ప్రారంభమైంది. ఇంగ్లీషు విద్యాభ్యాసం మూలంగా దేశం నలువైపుల క్రొత్త క్రొత్త ఆలోచనలు - క్రొత్త క్రొత్త రచనలు ఉద్భవింపసాగాయి. 19వ శతాబ్దం పూర్తి కావచ్చేటప్పటికి భారతీయ సమాజంలో వచ్చిన మార్పులు - 20వ శతాబ్దం నుంచి ఇంకా ఎక్కువై

సాహిత్యంమీదకూడా ప్రభావాన్ని చూపింపసాగాయి. ఇలా 19వ శతాబ్దపు చివరి దశాబ్దం నుంచి 1920 వరకు ఆధునిక కన్నడ సాహిత్య నిర్మాణానికి అనేక ప్రయోగాలు జరుగుతూ వచ్చాయి. అయితే ఆధునిక సాహిత్యమని చెప్పదగిన రీతిలో స్పష్టమైన రూపు రేఖలు 1920 నుండి కన్పిస్తాయి 1920 తరువాత భారత దేశంలో ప్రజలలో జాగృతి కల్గింది; స్వాతంత్రేచ్ఛ సర్వతోముఖంగా పెంపొందసాగింది. గాంధీగారి అసహాయ నిరాకరణోద్యమం ఫలితంగా ప్రజలలో చైతన్యం పెల్లుబికింది. సాహిత్యంలో గూడా స్వాతంత్ర్య ప్రియత్వం, నూతన ప్రక్రియలను, పద్ధతులను సృష్టించాలనే ఆకాంక్ష కవులలో ప్రబలింది,

శ్రీ కంఠయ్యగారి ఆధ్వర్యంలో తళిరు (తలిరు) గుంపు, శ్రీ బేంద్రేగారి ఆధ్వర్యంలో 'గెళెయర గుంపు' (స్నేహితులగుంపు), శ్రీ మంగేశరయ్యరు ప్రారంభించిన 'మిత్రమండలి' మొదలైనవి ఆధునిక కన్నడ కావ్యానికి స్ఫూర్తినిచ్చాయి.

ఏ కాలం వారితో పోల్చినా మాస్తిగారు ప్రముఖులుగా కన్పిస్తారు నవలలాగానే కథ కూడా కన్నడంలో 20వ శతాబ్దం ప్రారంభం నుండి అనేక రూపాలను దాల్చింది. 1900 ప్రాంతంలోనే సర్వశ్రీ పంజె, మంగేశరాయరు; ఎం. ఎస్. కామత్ మొదలైనవారు కథానికా రచనను ప్రారంభించారు. అయితే కథానికకు కన్నడంలో ఒక విశిష్టస్థానాన్ని సంపాదించిపెట్టిన వారు మాస్తి. వేంకటేశ్ అయ్యంగారు 20వ శతాబ్దంలోని 2వ దశాబ్దంలో మాస్తిగారు రచించిన కథలు "కెలవు సణ్ణకతెగళు కొన్ని కథానికలు అనే పేరుతో ప్రకటితమైనాయి. సుమారు 75 కథలను రచించిన మాస్తి ఏ మాత్రం వికృతంగా, హాస్యాన్నికూడా తమ కథలలో మిళితం చేయలేదు. ఆయన కథలలో వివరణాత్మక కథలున్నాయి; నాటంగా నడిచే కథలున్నాయి. కన్నడ కథానికా క్షేత్రంలో ఆదర్శవంతమైన జీవితం మాస్తి గారి కథలలో రూపొందింది. 'కవియ కొనెయ దిన (కవి చివరిదినం) అనే కథలో మాస్తి జర్మనుకవి గేటీ జీవితాన్ని చిత్రించారు. 'గౌతమియ కతె' మొదలైన వాటిల్లో పౌరాణిక వస్తువును వాడుకొన్నారు. 'ఒందు హళెయ కథ' ఒక పాతకథ, విచిత్రప్రేమ మొదలైన మంచి కథలు పేర్కొనదగినవి. వారి కథా కావ్యసంపుటం "అరుణ"లో 'మదలింగన కణివె (పెండ్లికొడుకు కనుమ) అతి విశిష్టమైనది. గ్రామ నామ చరిత్ర నాధారంగా రచింప బడింది, మైసూరు ప్రాంతంలో చిక్క 'నాయకన హళ్లి' తాలూకా కేంద్రానికి ఎనిమిదికిలోమీటర్ల దూరంలో ఉన్న చిన్న పల్లెటూరు "మదలింగన కణివె' పెళ్ళికొడుకు కనుమ) ఈ గ్రామాన్ని చుట్టు పల్లె అని కూడా పిలుస్తారు. ఈ కనుమ చరిత్రలో దాగినకథ రాతి గుండెలను సైతం కరిగిస్తుంది. సరళమైన 'రగడ'లో సాగిన యీ కథ గద్య శైలికి సన్నిహితంగా ఉంటుంది.

మాస్తి గారి సంప్రదాయాన్ని అనుసరించి అనేక రచయితలు కన్నడంలో కథలు వ్రాస్తున్నారు. వారిలో పేర్కొనదగినవారు ఆనంద్. పాశ్చాత్య సంపర్కం వల్ల కన్నడంలో సమర్థంగా అభివృద్ధి ప్రక్రియ నవల నవలలను కన్నడంలో కాదంబరి ఈ పదం మరాఠీతో నుంచి కన్నడంలోనికి దిగుమతి అయ్యింది. నః కాదంబరి అనే పర్యాయపదం బహుశ బాణుని కాదంబరి నుండి మరాఠీలోనికి వచ్చి ఉండాలి. నవల అని చెప్పచెప్పదగిన రచనలు 19వశతాబ్దం నుండి కన్నడంలో ఉన్నాయి. 20వ శతాబ్దం ప్రారంభం కాకముందే రెండు మూడు నవలలు కన్నడంలో వెలిశాయి. కన్నడంలో ఆధునిక నవల శ్రీ ఎం. ఎస్. పుట్టణ్ణగారితో ప్రారంభమైంది. కన్నడ నవలాక్షేత్రంలో మొట్ట

మొదట పేర్కొనదగిన మహా రచయిత శ్రీ కె. శివరామ కారంత్ మాస్తిగారి 'సుబ్బణ్ణ' అనే నవలను విద్వాన్ విశ్వంగారు తెలుగువారికి పరిచయం చేసారు ఇందులో ఉపాధ్యాయుని దయానీయ జీవితాన్ని చిత్రీకరించారు. ఇందులో కథ అంటూ ఏమీ లేకపోయినా మాస్తిగారి కథన కళ పాఠకులను విపరీతంగా ఆకర్షిస్తుంది.

కన్నడంలో వ్యాసాన్ని ప్రబంధం అంటారు. రచన అనే అర్థంలో 'లేఖన' అనే పదం వాడుకలో ఉంది. రచయితలను కన్నడంలో లేఖకరు అంటారు మాస్తి మొదలైనవారు తమ ఉపన్యాసాలలో కన్నడ దేశంలో మూలమూలలకు సాహిత్యాన్ని తీసికొని వెళ్ళారు, వారివల్ల ఉపన్యాసం శక్తివంతమైన సాధనంగా రూపొందింది; తద్వారా సాహిత్యానికి విలువను పెంచారు, మాస్తిగారి సాహిత్య పేర్కొనదగిన రచన. విమర్శకు సాధనంగా వ్యాసం వారికి ఎంతో తోడ్పడింది.

కన్నడ సాహిత్యానికి ఎన్నో విధాలుగా ఎనలేని సేవచేసిన మాస్తి నాటక సాహిత్యానికి కూడా తమ అమూల్యమైన కానుకలను సమర్పించారు. 1933లో యశోధర అనే నాటకాన్ని వ్రాశారు. 'పురందరదాస' అన్న ఆయన రచన కన్నడదాస శ్రేష్ఠుని భక్తి జీవితాన్ని ప్రదర్శిస్తుంది.

భారతీయ సాహిత్యంలో పండితులు, కవులచేత ఉపేక్షింపబడిన నారీమణులిద్దరున్నారు. వారు 1. ఊర్మిళ 2. యశోధర తెలుగులోని ఊర్మిళాదేవి నిద్ర అనే స్త్రీల పాటవిని శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు ముగ్ధులయి హిందీలోనికి, ఇంగ్లీషులోనికి అనువదించారు. ముక్కుపచ్చలారని భార్య యశోధరను, బోడ్డూడని పసిపాప రాహులుని వదలి సన్యసించి అడవిలో తపస్సుచేసి బుద్ధుడై నగరికి తిరిగివస్తున్న గౌతముని చూడటానికి ఊరంతా కదలిపోతున్నదని విని యశోధర సంభ్రమాశ్చర్యాలతో మునిగి తేలుతుంది. వెళ్ళేటప్పుడు చెప్పనివారికి ఎదురేగి స్వాగతం చెప్పడంలో ఔచిత్యమేముంది? ఒకవైపు ఆత్మాభిమానం, రెండవవైపు భర్తని చూడాలనే ఉద్వేగం ఆమెలో పెనవేసి కొంటాయి. ఆ పరిస్థితిలో ఆమె పరిస్థితిని ఆమె మాటలలో 'మాస్తి' గారిలా చెప్పించారు; 'ఊరు ఊరే వీరినెదురుకొనగా బయలుదేరినది నేను పోరాదు, నా పుణ్యమును ఏమంచు నిందింతు? కపిల వస్తువునందు బాల్యమున వారున్న కాలమున ఇంతంత తెలిసినవారు, తెలియనివారు; అంతిపురితోన ఇంతింత సేవ చేసినవారు, చేయనివారు; దూరమున నిలిచి మ్రొక్కినవారు; వారిలో చనుచున్న, తోడి వారలతోడ 'అదెచూడు యువరాజు, సిద్ధార్థుడేగెడిని' అనువారు; గురుతున్నవారు, లేనట్టివారును, వారిపేరు మాత్రమే విన్నవారును, విననివారు; అందరును మావాడు, మా రాచకొమరుండు, మా గురువటరాదు సంభ్రమముతో నాపతిని కనవచ్చును. తన మనః ప్రాణ సర్వస్వమును అతని తన మనః ప్రాణ సర్వస్వమును కలిపి ఒక్కటై బ్రతుకులో అర్థముగనున్న సతి నేనిప్పుడు కనరాదు" వచ్చేటప్పుడు పతి ఎట్లు నిలబడిరి? ఎట్లుండిరి, రవంత వర్ణించి చెప్పుకుని చెలికత్తె అంబికను యశోధర అడుగగా అంబిక ఇలా వర్ణిస్తుంది.

పూర్ణిమనాటి గగనాన తారకల మధ్యమున నిండి వెలిగెడు చంద్రునట్లు వెలిగెదరు. మన పుష్కరణిలో శ్రావణీదయమునందు తామరసరాజము మిగత తామరల బలగమున అరవిరసి వెలుగుసటు బిఱుసగవు మెరపులను, చిమ్ముచున్నారమ్మ; పసిబాలువోలె ముద్దనట్టి ముఖముద్ర, మీ ముద్ర; మీ ముఖములో నాకు కనబడదు దయ, మిసిమి వృద్ధరాజుం ముఖ గంభీరము, గొప్పదనమో జగతి నలముకొని, రక్షింపగలనన్న కారుణ్య రసమొలికి, వెలుగు, నేత్ర ద్వయము? ధీరమగు విగ్రహము, తామరస వర్ణమున

కోలిల్లు వస్త్రమ్ము మకుటమోయనపైకి ఎత్తికట్టిన జటాచ్ఛుటు అని అంబిక సిద్ధార్థుని రూపరేఖలు చిత్రోపమ శైలిలో వర్ణింపగా విని ముద్దరాలు యశోధర ముగ్ధురాలవుతుంది.

యశోధర ప్రాచీన నాటక ఫక్కీలో వ్రాయబడినా -ఆధునిక భావాలు, ఆధునిక మనో వైజ్ఞానిక విశేషాలు-అందుచోటు చేసికొన్నాయి. దీనిని శ్రీ శంకరగంటి రంగాచార్యులుగారు తెనిగించి భారతి పత్రికలో ప్రకటించినారు.

వ్యక్తిత్వం :

మాస్తి జీవితంలో కష్టపడి పైకివచ్చిన వ్యక్తి. స్కూలులో చదువుకొనేటప్పుడు జీతం కట్టడానికి డబ్బులేక బాధపడిన వ్యక్తి. ఉద్యోగం చేసేటప్పుడు గాని, రచనలు కొనసాగించేటప్పుడుగాని డబ్బు సంపాదింపాదించాలని అఱ్ఱులు చాచిన వ్యక్తిగాదు. తాను రచయితననే విషయం ఎన్నడూ మఱచిపోలేదు. తోటి రచయితల రచనలను చదివి విని ఆనందించేవారు. వారి రచనలను అచ్చువేసి ఇవ్వదగిన ప్రోత్సాహ మిచ్చేవారు. శ్రీ పుట్టప్పగారి ప్రధాన రచన కొలలు; శ్రీ బేంద్రీగారి రచన గారి; శ్రీ గోరూరిగారి రచన 'నమ్మహళ్లి చిత్రగళు' అనే రచనలను మాస్తిగారు ప్రచురించి ప్రచురణకర్తగా విశేష ఖ్యాతి నార్జించారు.

యువరచయితలను ప్రోత్సహించి పైకి దీసికొని వచ్చారు. రాజారామ్‌వారి ప్రోత్సాహంతోనే ప్రసిద్ధ రచయిత అయిన విషయం లోక విదితం.

డబ్బు ఉన్నప్పుడు-లేనప్పుడుగూడ ఒక రకమైన సాత్త్విక జీవితానికి అలవాటుపడిన యోగి; ఆయన భోగికాదు. గవిపురంలోని అత్యంత ప్రాచీనమైన సామాన్య గృహంలోనే తన జీవితాన్ని వెళ్ళబుచ్చారు. కారుకొనే స్తోమత ఉన్నప్పటికి కారు కొనలేదు. పెద్ద భోగాలను జీవితంలో ఎప్పుడు ఆశింపలేదు. బహుమతుల రూపేణా వచ్చిన డబ్బంతా ప్రజోపయోగ కార్యాలకు వినియోగించేవారని వినికిడి. అయితే ఆయన ఎంత ఉదారవంతులో డబ్బు విషయంలో అంత నిక్కచ్చిమనిషి. ఎన్ని పుస్తకాలున్నాయి. ఎన్ని పుస్తకాలు ఖర్చు అయినాయి అని లెక్క తేల్చి అకౌంటు వ్రాసికొనేవారట. ఇంటికి వచ్చిన అతిథులనాదరించడంలో మేటి. రచయితలను సరదాగా పిలిచి భోజనం వడ్డించి ఆదరించేవారట ఉత్తరం వ్రాస్తే జవాబు వెంటనే వస్తుంది అని పాఠకులు ఉబలాట పడుతారు. ఏదైనా తప్పు చేశానని అంతరాత్మ ప్రబోధిస్తే తప్పును సరిదిద్దుకొనేవారు. అన్నం తినడం ఎలా జీవలక్షణమో వ్రాయడంకూడా మాస్తిగారికి దైనందిన నిత్యకృత్యం. తుదిశ్వాస విడిచే వఱకు ఆయన వ్రాస్తూనే ఉన్నారు. నిత్యం చిరునవ్వుతో జీవితం వెళ్ళబుచ్చిన మహా తపస్వి. నాకు బహుమతి తప్పక వస్తుంది అని ఘంటాపథంగా చెప్పిన కర్మవీరుడు. ఆత్మవిశ్వాసంతో - 'అహం' చైతన్య శక్తితో - మృదుమందహాసంతో మాస్తిగారి వ్యక్తిత్వం ఉట్టిపడేది. మాస్తి మహామనిషి మంచి మనిషి, సివిలు సర్వీసులో నున్నప్పుడు ప్రజల కష్టసుఖాలతో పాలుపంచుకొని నిజవిధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చిన ఆదర్శజీవి. రచయితగా కలంచేపట్టి తన శక్తినంతా ధారవోసి కన్నడ సాహిత్యాభివృద్ధికి తోడ్పడిన సరస్వతీపుత్రుడు. తమిళం మాతృభాష అయినా కన్నడభాషకు పుష్టిని పెంపొందించి కన్నడిగులకు తుష్టిని కలిగించిన బ్రాహ్మమయమూర్తి శ్రీమాన్ మాస్తి వేంకటేశ అయ్యంగారు. ఆధునిక

కన్నడ కథాపితామహుడు; నవల, నాటక, విమర్శ జీవనచరిత్ర అనువాద, కథా కావ్యకర్తృత్వం, సంపాదకత్వం మొదలైన విభిన్న పీఠ ప్రశస్తి నందుకొన్న సాహితీమూర్తి; జ్ఞానపీఠం బహుమతిని గ్రహించిన తపస్సంపన్నులు. మాస్తి-మాయాస్తి అని కన్నడిగులు పొంగిపోతున్నారు. జ్ఞానపీఠ బహుమతి నందుకొన్న తర్వాత మాస్తి రచనా సంపత్తి భారతీయుల యావదాస్తి అని మనం గర్వించాలి. మాస్తి భౌతికంగా మన మధ్యలేరు. వారి మంచితనం వారి పాండిత్యం, వారి ఆలోచనామృతం ఇవే మనకు మిగిలాయి. వారి రచనలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి వారి ఆశయసిద్ధికి తోడ్పడడం సహృదయుల కనీసధర్మం. ఇదే మనం వారికి అర్పించే నివాళి; మనం సమర్పించే నీరాజనం.

ప్రొఫెసర్, హిందీశాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం
వాల్తేరు-530 003

# సాహిత్య వారధి శ్రీ ఆరిగపూడి

— కాలిపు వీరభద్రుడు

దేశ సమైక్యతకు సహకరించిన సశక్త సాధనాలలో సాహిత్యకారులు ప్రముఖ పాత్ర వహిస్తారనడం అతిశయోక్తి కాదు. జాతీయ భాష హిందీ ద్వారా ఐక్య భారతి కోసం గణనీయమైన కృషి చేసిన రచయితలలో ప్రసిద్ధులు ఆంధ్రులైన శ్రీ ఆరిగపూడి.

ఆరిగపూడి రమేష్ చౌదరి గారు హిందీలో ప్రసిద్ధ రచయిత. పత్రికా రచయిత. ఆకాశవాణిలో సీనియరు ప్రొడ్యూసరు. ఆంగ్ల హిందీ పత్రికా సంపాదకునిగా, పత్రికా ప్రతినిధిగా ప్రఖ్యాతి గాంచినవారు.

బహుభాషా కోవిదులు, బహుముఖ ప్రతిభాశాలి అయిన శ్రీ ఆరిగపూడి హిందీలో రెండు డజన్లకు పైగా నవలలు వ్రాసేరు. ఎన్నో కథలు, ఇంకెన్నో నాటికలు వ్రాసి ప్రచురించేరు, ప్రసారం చేసారు. సంస్కృతీ సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు, జీవిత చరిత్రలు వ్రాసి హిందీ సాహిత్య లోకంలో పేరెన్నిక గన్నారు. దక్షిణ భారతదేశాన్ని రచనా వస్తువుగా స్వీకరించి యిచ్చటి ప్రజలు, సాంఘిక జీవితం, ఆచార వ్యవహారాలను ఉత్తరాది వారికి పరిచయం చేయడం ద్వారా దేశ సమైక్యతకు పాటుపడిన ధన్యులు. అందుకే ఉత్తర దక్షిణ భారతదేశాల మధ్య సాహిత్య వారధిగా శ్రీ ఆరిగపూడి ప్రసిద్ధి చెందారు.

ఆరిగపూడి రచనలు చదువుతూ ఉంటే ఎవరో హిందీ మాతృభాషగా గల రచయితే వ్రాసారనుకుంటాం, అంతేగాని ఆంధ్రుడు వ్రాసాడనుకోం. వీరి రచనలు హిందీ నుడికారం తోను 'హిందీ తనం' తోను నిండి ఉంటాయి. అంచేతనే వీరు హిందీ మహా రచయితల శ్రేణిలో తనదంటూ ఒక సుస్థిర స్థానాని

నిలబెట్టుకో గలిగారు. లలితము, మధురము అయిన చిన్ని చిన్ని పదాలతో అల్లిన అతి చక్కనివి చిన్నవి అయిన వీరి వాక్యాలు భావౌన్నత్యంతో కమనీయంగా ఉంటాయి. చకచకా ముందుకి సాగిపోతాయి. తన దొక ప్రత్యేక శైలిని హిందీ సాహిత్యంలో వీరు సుస్థిరం చేసుకున్నారు.

నవల, కథ, నాటికలలో వీరి భాష సరళం గాను సుగమంగాను ఉంటుంది. అందలి పాత్రలు మన చుట్టూ ఉన్న మానవుల్లాగే సజీవమూర్తులు. మంచి చెడుల సమ్మేళనంతో మలచబడిన రక్త మాంసాదు లున్న మానవులు. ఇంక, వీరి వ్యాసాలు గురు గంభీరమైనవి. వీరికి గల పాండిత్య ప్రతిభకు, భాషా పటిమకు సునిశితమగు పరిశీలనా దృష్టికి, అభ్యుదయ దృక్పథానికి ఆ వ్యాసాలు నిదర్శనాలు.

శ్రీ ఆరిగపూడి తాను చెప్పదలచుకొన్న విష యాన్ని పాఠకులు తేలికగా గ్రహించేటట్టు వ్రాయ గల దిట్ట. అయితే ఆ విషయం విమర్శకుల ఝుంఝా మారుతానికి ఏ మాత్రమూ చలించనంతటి శక్తి వంతంగాను పునాది గలది గాను, ధృఢం గాను ఉంటుంది. పాత్ర చిత్రణలో కూడా వీరికి గల యీ ప్రత్యేకత కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. వీరి రచన లలో భాష, భావం ఒకదానితో ఒకటి పోటీ పడుతూ నిర్ఝరీ వేగంతో ముందుకి సాగిపోతూ ఉంటాయి.

సాహిత్య లోకంలో ఆరిగపూడిగా సుపరిచితులైన శ్రీ రమేష్ చౌదరి 1922 లో ఉయ్యూరులో జన్మిం చేరు. ఆంధ్రాంగ్ల హిందీ భాషలలో వీరు మంచి పండి తులు. సంస్కృత భాషా కోవిదులు. దాక్షిణాత్య భాష లన్నిటిలోనూ ప్రావీణ్యత గడించిన ప్రతిభావంతులు.

మద్రాసులో హిందూ పత్రికకు జర్నలిస్టుగా పని చేసినప్పటి నుంచి వీరి పత్రికా జీవితం ప్రారంభ మయ్యింది. తర్వాత వీరు బొంబాయిలో ఫ్రీ ప్రెస్ జర్నల్‌లో పని చేసారు. ఆ తర్వాత మద్రాసులో 'ఇండియన్ రిపబ్లిక్' పత్రికకు లీడరు గాను, రైటరు గాను, ఎడిటర్ గాను పనిచేశారు. హిందుస్తాన్ టైమ్సు ఫోరమ్ పత్రికలకు ప్రతినిధిగా ఉండడమే కాకుండా వీరు యింకెన్నో పత్రికలకు రచనలు పంపుతూ వాటిలో కూడా పని చేసేవారు.

'దక్షిణ భారత్' అనే హిందీ సాహిత్య మాస పత్రికకు ఎనిమిదేళ్ళు, చందమామ (హిందీ) పత్రికకు పదేళ్ళు వీరు సంపాదకులుగా పని చేసారు. హిందు స్తాన్, ఆజ్ లాంటి ప్రముఖ హిందీ దిన పత్రికలలో వీరి రచనలు వెలువడ్డాయి. విశాల భారత్, ధర్మ యుగ్, సాప్తాహిక్ హిందుస్థాన్ సారిక, ఆజ్‌కల్, కాదంబిని, నయీ కహానియా, నయీ ధారా మొద లైన పత్రికలలో వీరి రచనలు రమారమి ముప్పయి సంవత్సరాలు పుంఖానుపుంఖాలుగా వెలువడ్డాయి.

1950 లో ఆలిండియా రేడియో వారు వీరిని ఇంగ్లీషు బ్రాడ్‌కాస్టరుగా ఆహ్వానించారు. వీరు ఇంగ్లీషు హిందీలలో అనేక విషయాలు ప్రసారం చేసారు. అప్పుడే వీరు నాటకాలు, కథానికలు, ప్రసంగాలు, ఇంటర్వ్యూలు, రన్నింగ్ కామెంటరీలు ప్రసారం చేసారు. ఆలిండియా రేడియో మద్రాసులో సీనియరు ప్రొడ్యూసరుగా పని చేసారు.

వీరివి సుమారు నలుబది పుస్తకాలు ప్రముఖహిందీ సంస్థలు అచ్చు వేసాయి. ఇంకా అనేక రచనలుగ్రంథ రూపంలో వెలువడ్డానికి సిద్ధంగా ఉన్నాయి. అచ్చ యిన వాటిలో అనేక గ్రంథాలు పునర్ ముద్రణలు పొందుతున్నాయి. చాలా నవలలు ప్రముఖ హిందీ పత్రికలలో సీరియల్‌గా వచ్చాయి.

వీరి పాతిక నవలలు, నాలుగు కథానికా సంపుటాలు. మూడు నాటికల సంపుటాలు, రెండు బాలసాహిత్యానికి సంబంధించిన గ్రంథాలు, వ్యాస సంపుటాలు, జీవిత చరిత్ర మొదలైన అనేక గ్రంథాలు హిందీలో వ్రాసారు. పుస్తక రూపంలో వెలువడ్డానికి ఇంకెన్నో రచనలు సిద్ధంగా ఉన్నాయి.

శ్రీ ఆరిగపూడి గారిది అనువాదంలో కూడా అందె వేసిన చేయి. అడివి బాపిరాజు గారి నారాయణ రావు నవలను మరొక తెలుగు గ్రంథాన్ని కాలీ మిట్టి అనే పేరుతోనూ హిందీ లోకి అనువాదం చేసారు. పంజాబీ కథలు అనే హిందీ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించేరు.

ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం వారు వీరి ఏడు నవలలకు బహుమతుల నిచ్చి వీరిని సత్కరించారు. సాంత్ గాంత్ నవలకు కేంద్ర ప్రభుత్వం వారు బహుమతి యిచ్చారు. అంతర్జాతీయ కథానికల పోటీలో 'భగవాన్ భలా కరే' అనే వీరి కథానికకు బహుమతి లభించింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారు బహుమతి యిచ్చి వీరిని సత్కరించేరు. వీరికి 1974 లో మహాత్మాగాంధీ బహుమతి లభించింది.

వీరివి చాలా నవలలు తెలుగు, తదితర భాషల్లోకి తర్జుమా చేయబడ్డాయి. నేను (యీ వ్యాసకర్త) వీరివి మూడునవలలు తెలుగులోకి అనువదించి ప్రచురింప చేసాను, వీరివి రెండు నవలలు రష్యా భాషలోకి అనూదిత మయ్యాయి. మూడు నవలలు యూనివర్సిటీల వారిచే పాఠ్యగ్రంథాలుగా నియమింపబడ్డాయి. ప్రముఖ హిందీ కథల సంపుటాలలో వీరివి అనేక కథలు ఎన్నుకోబడ్డాయి.

సాహిత్య ఎకాడమీలో సభ్యులుగా వీరిని ఆంధ్ర ప్రభుత్వం రెండుసార్లు ఎంపిక చేసింది. అనేక సాహిత్య సంస్థలు వీరిని తమ సభ్యునిగా ఎన్నుకున్నాయి. రీజినల్ ఫిల్మ్ సెన్సార్ బోర్డులో పదేళ్ళు మెంబరుగా ఉన్నారు. క్విట్ యిండియా ఉద్యమంలో ప్రజల మన్ననలు పొందిన వీరి దేశభక్తి తామ్రపత్రాన్ని పొందింది.

దేశంతో పలుచోట్ల జరిగిన సాహిత్య సంస్కృతులకు సంబంధించి అనేక సభా సమావేశాల్లోనూ చర్చల్లోనూ వీరు ఆహ్వానింప బడ్డారు. ప్రథమ హిందీ ప్రపంచ సభల స్మారక సంచిక సంపాదక వర్గంలో వీరిది గణనీయమైన పాత్ర. ద్వితీయ హిందీ ప్రపంచ సభలకు వీరిని మారిషస్ ప్రభుత్వం ఆహ్వానించింది. 1977లో ఆంధ్రా యూనివర్సిటీ వారు కళాప్రపూర్ణ బిరుదుతో వీరిని సత్కరించింది.

ఇంతటి ప్రతిభావంతులైన కళాకారులుగా ప్రసిద్ధి చెందిన వీరు తనకు తాను అజ్ఞాతంగా ఉండాలని సదా ప్రయత్నించే మహా నిగర్వి, నిరాడంబరులు. నాలాంటి సామాన్యుల్ని సైతం ఆదరాభిమానాలతో చూసే శ్రీ ఆరిగపూడి సహజ స్నేహశీలి. నవ్వుతూ అందర్నీ నవ్వించే వీరు మద్రాసులో షెనాయ్‌నగర్‌లో నివసించేవారు. భౌతికంగా వీరు యీనాడు మనతో లేకపోయినప్పటికీ తమ రచనల ద్వారా వీరు అజరామరులు.

హిందీ లెక్చరర్,
ప్రభుత్వ జూనియర్ కళాశాల
నర్సీపట్నం-531 116
విశాఖపట్నం జిల్లా

# స్వాతంత్ర్యోద్యమంలో కవుల పాత్ర

— టి. సర్వేశ్వరరావు

'జనని జన్మభూమి స్వర్గంకంటే మిన్న' అని ఆర్యోక్తి. స్వతంత్రదేశం, స్వతంత్ర జాతి మాత్రమే సమ్మాననీయం అవుతుంది. అందుకే పారతంత్ర్యం పోగొట్టుకోవడానికి, తమ స్వతంత్ర్యాన్ని నిలుపుకోవడానికి ప్రపంచంలో ఎన్నోచోట్ల ఎన్నో ఉద్యమాలు నడిచాయి, నడుస్తున్నాయి.

భారతదేశం శతాబ్దాలనుండి పరాధీనంగా వుంది. దాస్యంలో మ్రగ్గుతున్న దేశ విమోచనకోసం, ఎందరో దేశభక్తులు, త్యాగధనులు తమ ధన మాన ప్రాణాలను అర్పిస్తే, కవులు తమ కలాలను దేశసేవకు అర్పించారు. గాంధీజీ పిలుపును అందుకొని ఉదర పోషణకై చేస్తున్న ఉద్యోగానికి ఉద్వాసన చెప్పి ఉద్యమంలో దూకిన కవులు ఎందరో ఉన్నారు

భారత స్వాతంత్రోద్యమ కాలంలో కవులు దేశభక్తి పూరితాలైన గీతాలద్వారా ప్రజలలో జాతీయతా భావాన్ని, స్వాతంత్ర్య పిపాసను రేకెత్తించి, పర పీడన లేని సర్వస్వతంత్ర సమాజ నిర్మాణానికి వారిని ఉద్యుక్తులను చేసారు. సాంఘిక దురాచారాలను ఖండించి, రచనలద్వారా ప్రజలలో ఐకమత్యాన్ని పెంపొందించారు భారతదేశ గత వైభవాన్ని స్మరించి తద్వైభవాన్ని పునఃప్రతిష్ఠించటంకోసం ఆత్మ బలిదానం కావించమని ప్రబోధించారు. స్వాతంత్రోద్యమంలో స్వయంగా పాల్గొని, ఉద్యమానికి దోహదం చేసిన కవుల అవిస్మరణీయమైన సేవలను మరోసారి మననం చేసుకోవడం ఈ వ్యాస ప్రధానోద్దేశ్యం.

**ప్రప్రథమ జాతీయోద్యమ కవిసైనికుడు :**

స్వాతంత్రోద్యమ కవితకు ప్రప్రథమంగా నాంది పలికినకవి చిలకమర్తి. 1905లో జరిగిన వంగ విభజనతో దేశం అతలాకుతలమైపోయింది. ఆంగ్లేయులకు విరుద్ధంగా వందేమాతరం ఉద్యమం తలెత్తింది. జాతీయోద్యమం ఇక్కడి నుండే ఊపు అందుకుంది. ఆ ఉద్యమదినాల్లోనే బి.పిన్. చంద్రపాల్ రాజమండ్రిలో పర్యటించారు. వారి ఉపన్యాసాలను చిలకమర్తి వారే తెనిగించారు. ఆ సభావేదిక నుండి ఆంగ్లేయులను తీవ్రంగా విమర్శిస్తూ ఈ పద్యం చెప్పారు.

'భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.'

ఈ పద్యం ఆంధ్రుల జిహ్వాగ్రంపై నర్తించింది. జాతీయోద్యమ కవితకు బీజావాపనం చేయటమే కాకుండా, కాంగ్రెసు సమావేశాల్లోనూ, గోదావరి మండలి సమావేశాల్లోనూ పాల్గొని తన మహోపన్యాసాలచే ప్రజలలో దేశభక్తిని పెంపొందించారు. అసహాయోద్యమంలోనూ, విదేశీవస్తు బహిష్కరణోద్యమంలోను ఆయన చాల చురుకుగ పాల్గొన్నారు. స్త్రీ సముద్ధరణకోసం, నిమ్నజాతుల ఉద్ధరణకోసం, గాంధీకంటే ముందుగనే కృషిచేసిన ఘనత చిలకమర్తిదే. ఈ ప్రయత్నంలో ఆయన తన ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయలేదు. అంధుడైన కారణంగానే స్వాతంత్రోద్యమంలో జైలుకు వెళ్ళలేకపోయాడు,

### కాంగ్రెసు లోపాల్ని ఎత్తిచూపిన గురజాడ:

కాంగ్రెసు నాయకులు రాజద్రోహులుగా, కాంగ్రెసులో పాల్గొనటం రాజద్రోహంగాను ఎంచబడిన రోజుల్లో మహాకవి గురజాడ కాంగ్రెసు సమావేశాల్లో పాల్గొని తన దేశభక్తిని ప్రకటించాడు. 1908లో మద్రాసులో జరిగిన కాంగ్రెసు సమావేశంలో పాల్గొని కాంగ్రెసులోని లోపాలను కూడా ఎత్తిచూపిన ధీశాలి. 1910లో మహోన్నతమైన "దేశభక్తి" గీతాన్ని జాతికి అందించాడు.

'దేశమును ప్రేమించుమన్న
మంచి అన్నది పెంచుమన్న
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్।

ఇలా దేశభక్తిని ప్రజల నరాల్లోనికిఇంజక్టుచేసాడుగురజాడ. 'దేశమంటే మట్టికాదు మనుషుల'నే నూతన దృక్పధాన్ని కల్గించాడు 'దేశీ సరకులు నించమని' ఉద్బోధించాడు.

### ఉద్యమకారులకుఉత్తేజాన్నికల్గించిన కవిరాజు :

ఇంగ్లాండులో బారిష్టరు చదువుతూ ఉన్న రోజుల్లోనే, చౌదరి గాంధీ ప్రభావంలోపడి, ఆయన నేతృత్వంలో సాగిన సత్యాగ్రహోద్యమంలో దూకారు. త్రికరణ శుద్ధిగా గాంధేయ సిద్ధాంతాలను పాటించటం వల్లనే ఇంగ్లాండులో ఉన్నా చౌదరి మద్యమాంసాలకు దూరంగా ఉన్నారు. చౌదరి మహా దేశభక్తుడు. రాజకీయ చతురుడు ఉత్తేజకరమైన ఎన్నో గీతాలద్వారా దేశీయులను జాగృతం చేసారు.

'వీరగంధము తెచ్చినారము
వీరులెవ్వరో తెల్పుడీ
పూసిపోదుము మెడను వైతము
పూలదండలు భక్తితో'

ఉప్పుసత్యాగ్రహం దినాల్లో ఈ గీతం ప్రతి సభలోనూ ఆలపింపబడేది. ప్రజలేకాకుండా నాయకులు కూడా జట్లుజట్లుగా వీరావేశంతో ముందుకు ఉరికేవారు.

### ఉన్నతోద్యోగాన్ని కాలదన్నిన బాపిరాజు :

ఉధృతంగా సాగుతున్న స్వాతంత్ర్య సమరాగ్నికి తానుకూడా ఒక సమిధను ఆహుతిచ్చినవాడు అడవి బాపిరాజు. న్యాయవాద వృత్తిని వదలి అసహాయోద్యమంలో పాల్గొన్నందుకు బాపిరాజుగారు రాయవేలూరు జైలులో నిర్బంధించబడ్డారు. ప్రభుత్వంలో మంచి హోదాలో ఉన్నవారి బంధువులు బాపిరాజుకు శిక్ష పడకుండా తప్పించాలని ప్రయత్నించినా, ఆ ప్రయత్నాలను వమ్ముచేసి కారాగార క్లేశాలను చిరునవ్వుతో అనుభవించిన నిష్కళంక దేశభక్తుడు బాపిరాజు. మహాత్ముని దివ్యవాణికి వశవర్తియై, ఆయన వేసిన ప్రతి అడుగును పాటగా మలచిన మహనీయుడు బాపిరాజు. వేలాది జనులను తన గీతాలతో మహోపన్యాసాలతో ప్రభావితం చేసారు. బాపిరాజుగారి గురువు ఆన్వాల్డ్ కూల్డే) దొర బాపిరాజుకు ఉన్నతోద్యోగం లభించే యేర్పాటు చేయగా, విదేశీయులకు ఊడిగం చేయనని, ఆ ఉద్యోగాన్ని సైతం తృణీకరించిన అద్వితీయ స్వాతంత్ర్య పిపాసి ఆయన.

### ఉద్యమాలకు అక్షరరూపం యిచ్చిన అప్పారావు :

ప్రతి కాంగ్రెసు సమావేశానికి విధిగా హాజరవుతూ, గాంధీజీ యిచ్చిన ప్రతిపిలుపుకు స్పందిస్తూ, జాతీయోద్యమానికి చేయూత నిచ్చిన జాతీయకవి బసవరాజు అప్పారావు. సహాయ నిరాకరణోద్యమంలోనూ హరిజనోద్యమంలోను ఎంతో ఉత్సాహంగా పాల్గొన్న కార్యకర్త బసవరాజు. సీమ గుడ్డ కట్టి తిరిగే వారిని 'సిగ్గులేదా నీకు శరములేదా' అని నిందించటమే కాకుండా, తన భార్య పట్టుచీరలను కుప్పపోసి నిప్పంటించాడు. రైతులచే పన్నులు ఎగవేయించాడు.

గాంధీజీ నేతృత్వంలో సాగిన ప్రతి ఉద్యమానికి అక్షరరూపం యిచ్చిన అమరకవి బసవరాజు.

### జాతీయ కవిచక్రవర్తి :

దేశంకోసం తన సర్వస్వాన్ని పణంపెట్టిన అద్వితీయ దేశభక్తుడు, అసమాన త్యాగజీవి గరిమెళ్ళ సత్యన్నారాయణ ఈయన గీతాలు ఆంధ్రులనే కాకుండా, ఆంధ్రేతరులను కూడా చాలా తీవ్రంగా కదిలించాయి. 'మాకొద్దీ తెల్ల దొరతనము' అనే గేయాన్ని గరిమెళ్ళ కంచుకంఠమెత్తి ఎంతో ఉద్రేకంతో ఆలపిస్తుంటే భాష తెలియని తెల్లదొరలు సైతం గగుర్పాటు చెందేవారట. స్వయంగా గాంధీగారే ఈయన గీతాలు విని ఉత్తేజితులైనారు. గరిమెళ్ల గీతాలు విని ప్రజలు ఉద్రేకపూరితులై ఆంగ్ల ప్రభు ప్రభుత్వాన్ని సమూలంగా పెళ్ళగించి వేస్తారని, ఆనాటి తెల్లదొరతనం బయపడింది. 1921లో 121 ఎ. సెడిషన్ చట్టం క్రింద అరెస్టుచేసి 2 సంవత్సరాల జైలు శిక్షను విధించారు. కోర్టు విచారణలో వాంజ్మూలంయిస్తూ—

'కూలిపోతున్నది-కూలిపోతున్నది
మూలమట్టముతోటి-కూలిపోతున్నది ప్రభుత్వం
కూకటి వ్రేళ్ళతో కూలిపోతున్నది-మూర్ఖ
ప్రభుత్వం

అంటూ ఈ జాతీయ కవిచక్రవర్తి నిర్భయంగా అభిశంసించాడు.

### జాతీయ నాటక కవితాపితామహుడు :

జాతీయ నాటక కవితా పితామహుడుగా ప్రసిద్ధి చెందిన దామరాజు పుండరీకాక్షుడు 'వందేమాతరం' ఉద్యమంలో పాల్గొన్నాడు. గాంధీ ప్రభావానికి లోనై చదువుకు స్వస్తిచెప్పాడు. బ్రిటిష్ ప్రభుత్వం ఈయనను చాలాసార్లు నిర్బంధించింది. లాఠీలతో బాదించింది. ఫలితంగా ఈయన శ్వాసకోశం దెబ్బతింది. దేశంకోసం తన ప్రాణాలనుకూడా లెక్కించని మహాదేశభక్తుడు దామరాజు. ఈయన దేశభక్తి పూరితాలైన గీతాలు ఆలపిస్తూ, ఆంగ్లేయుల క్రూరకృత్యాలను నిరసిస్తూ వీధులలో ఊరేగింపుగా తిరిగేవారు. ఈయన రచనలను బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది, కొన్నింటిని తగుల బెట్టించింది. అంతేకాదు ఈయన రచనలు ఎవరివద్దనైనా కనుగొంటే వారిపైకూడా రాజద్రోహం నేరం మోపబడేది. దీనినిబట్టి ఈయన రచనలంటే ప్రభుత్వం ఎంత బయపడిందీ స్పష్టమవుతుంది.

### మంగిపూడి సోదరులు :

మంగిపూడి వేంకటశర్మగారు అసహాయోద్యమంలో పాల్గొని 2 సంవత్సరాలు కఠిన జైలుశిక్షను అనుభవించారు. దేశమే దైవమని, జాతీయతే తన మతమని చాటిన మహనీయుడీయన. దేశభక్తి పూరితాలైన ఈయన గీతాలు ఉద్యమ దినాల్లో ప్రజలకు నాయకులకు కూడా ఆరాధనా మంత్రాలైనాయి. వీరి సోదరులు పురుషోత్తమ శర్మగారు చెరసాలలకు సైతం బయటపడని నిర్భీక దేశభక్తులు. ఉద్యమంలో పాల్గొన్నందుకు, గీతాలద్వారా నిద్రాణ జాతిని జాగృతం చేస్తున్నందుకు ఈయనను రాయవేలూరు జైలులో నిర్బంధించారు. జైలులోనే ఈయన ఎన్నో గీతాలను రచించారు, స్వేచ్ఛాప్రియులైన ఈ కవి గీతాలు చెఱసాలలను సైతం ఛేదించుకొని ప్రజల జిహ్వాగ్రాలపై నర్తించేవి.

### మహాత్ముని ఆస్థానకవి :

తెనుగులెంక సీతారామమూర్తి చౌదరి జాతీయోద్యమానికి స్పందించి, ఉద్యమానికి వెంలేని తోడ్పాటును అందించారు. కాంగ్రెసు కార్యకర్తగా, గాంధీజీ అనుయాయిగా, స్వాతంత్ర సమర శంఖారావాన్ని ఆంధ్రదేశం నలుమూలలా ప్రతిధ్వనింప చేసారు. వాడవాడలా తిరిగి ఖద్దరు ప్రచారం చేసారు. సహాయనిరాకరణోద్యమంలో పాల్గొని, పెదనంది

పాడులో రైతులు పన్నులు కట్టకుండా నిరోధించారు. గాంధీజీ ఆత్మకథను కావ్యంబద్ధంచేసి ప్రజల్లో గాంధీపై అచంచల విశ్వాసాన్ని కల్గించారు.

**కవయిత్రులు కూడా :**

కవులేకాదు కొందరు కవయిత్రులుకూడా స్వాతంత్రోద్యమంలో పురుషులతో సమంగా తొలివరుసలో నిలబడ్డారు. వారిలో బసవరాజు రాజ్యలక్ష్మి (సౌదామిని), తల్లాప్రగడ విశ్వసుందరమ్మ లబ్ధప్రతిష్ఠితులు. విశ్వసుందరమ్మ జాతిని ఉత్తేజ పరిచే గీతాలను రచించటమే కాకుండా ఉద్యమంలో పాల్గొని కఠిన కారాగార క్లేశాలను అనుభవించారు.

**మరికొందరు :**

వందేమాతరోద్యమ పతకాన్ని ప్రాథమిక దశల్లోనే చేతబట్టి, దేశాభిమాన పూరితాలైన కవితల ద్వారా జాతిని ప్రబోధించిన అకళంక దేశభక్తుడు చెన్నాప్రగడ భానుమూర్తి. 'తెల్లవారి బ్రతుకులు తెల్లవారునింక గడియయైన సైపగలేమి ఇంగ్లాండు ప్రభుత్వము' అని గర్జించిన కవిశేఖరుడు గురుజాడ రాఘవశర్మ, గరికపాటి మల్లావధాని, వడ్డాది, పూడిపెద్ది, మారేపల్లి. రామచంద్రశాస్త్రి, నాళము కృష్ణారావు, జాస్తి వెంకట నరసయ్య, ఏటుకూరి వెంకట నరసయ్య, దుర్భాక రాజశేఖర శతావధాని, గడియారము వెంకటశేషశాస్త్రి, చర్లగణపతి శాస్త్రి, పురిపండా అప్పలస్వామి మున్నగు ప్రసిద్ధకవులు స్వాతంత్రోద్యమంలో పాల్గొని, ప్రజలను ఉత్తేజ పరిచే కవితలద్వారా ఉద్యమానికి తమ తోడ్పాటును అందించారు. వీరంతా గాంధేయ సిద్ధాంతాలు చిత్తశుద్ధితో ఆచరించి, స్వాతంత్ర్యంకోసం దేశ శ్రేయస్సుకోసం, నిర్విరామంగా పోరాడిన కవియోధులు. జాతీయోద్యమానికి సంబంధించిన విభిన్న ఉద్యమాలను తమ కవితల ద్వారా ప్రజాబాహుళ్యం మధ్యకు తీసుకువెళ్ళారు. స్వాతంత్రోద్యమ చరిత్రలో వీరంతా ప్రాతఃస్మరణీయులు.

లెక్చరర్,
కె. జి. ఆర్. ఎల్. కళాశాల
భీమవరం.

# ఆవు-పులి సంవాదం

డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి

ఆవు-పులి కథ అందరికీ పరిచయమే. పెద్దలు పిల్లలకు నీతిని బోధించటానికి ఇలాంటి కథల్ని చెబుతారు. ఈ కథలో గోమాత [తల్లి] పుత్రవాత్సల్యం, సత్యనిష్ఠ, త్యాగశీలంవంటి గుణాలు మనకు దర్శనమిస్తాయి. ఇవి మన పూర్వీకులు ఆచరించిన ఆదర్శ గుణాలు.

ఈ కథ తెలుగు సాహిత్యంలో అనంతామాత్యుడు భోజరాజీయమునందలి 'గోవ్యాఘ్రసంవాదం' అనే పేరుతో రచించాడు. కన్నడంలో అజ్ఞాతకవి 'గోవిన హాడు' అని పేరుపెట్టాడు. [చూ. స్రవంతి-సాహిత్య గోష్ఠి-డా॥ ఐ. ముద్దప్ప-సెప్టెంబరు. 1986] ఈ రెండింటిలోనూ కథ కొద్దికొద్ది మార్పులతో సాగింది.

*కథ :-* పశువులకాపరి ఆవుల్ని మేపటానికి అడవిలోకి తోలుకొనిపోతాడు. మేతమేస్తున్న ఆవుల్ని పులిచూస్తుంది ఒక ఆవును పట్టుకొని తింటానని అంటుంది. ఆవుపులిని వేడుకొంటుంది. నాకు లేకలేక కొడుకుపుట్టాడు. ఆ కొడుక్కు పాలిచ్చివస్తానని ప్రతి మాలుతుంది. చిట్టచివరకు బాసచేసి పులితో శెలవు తీసుకొని దూడదగ్గరికొచ్చి పాలిస్తూ బుద్ధిమాటలు చెప్పుతుంది-పుట్టెడుదుఃఖంతో ఆవు మాటమీద పులి దగ్గరకొచ్చి తినమని వేడుకొంటుంది. అలాంటి ఆవునుచూసి నీ దూడతో నీవు హాయిగా కాలంగడప మని చెపుతుంది. ఇలాకాకుండా అక్కడికక్కడే ప్రాణాలు వదలటం కూడా కన్పిస్తోంది. కథ అంత మవుతుంది.

'గోవ్యాఘ్రసంవాదం-గోవినహాడు' ఏది ముందు ఏదివెనక అనేఅనుమానం పరిశోధకలోకంలో వుండే ప్రశ్న. వీటిలో ఏది ముందు అయినా ప్రపంచ సాహిత్య భవనానికి మూలం జానపదసాహిత్యం [Folk-literature] అలాగే ఆవు పులి కథకు మూలం కూడా జానపదగేయాలే అనటానికి నిదర్శనం ఈ వ్యాసంలో ప్రదర్శించే గేయాలే. ఈ గేయాలు కోలాటం-చెక్కభజన' నృత్యాల్లో పాడుకొనేవి అక్షర జ్ఞానంలేని గ్రామీణుల ఇలాంటి కథాగేయాలు ఎన్నో వారి నాలుకలపై నాట్యమాడుతూనే వున్నాయి.

అట్టడుగున పడివున్న జానపదసాహిత్యం ద్వారా శిష్టసాహిత్యం పుట్టిందనటానికి పరిశోధకులు ఎన్నింటినో నిదర్శనాలు చూపించారు. జానపదసాహిత్యంలో ఆచార్య బిరుదురాజురామరాజుగారుమొదటిపరిశోధకులు. అసలు ఈ జానపద సాహిత్య సేకరణ రాయలసీమ లోనే 1874లో కడపజిల్లా కలెక్టర్ జె. ఏ. బోయల్ మొదటిగా సేకరించారు. ఆచార్య తూమాటి దోణప్ప గారు అనంతపురం ప్రాంతంలోని గేయాల్ని కోకొల్లలుగా సేకరించారు. ఇలాంటి పెద్దల అడుగు జాడల్లో పయనించి వెలికితీసిన కొన్నిగేయాలు ఈ వ్యాసంలో పొందుపరుస్తున్నాను. అవి ఆవు-పులి కథకు సంబంధించినవి.

ఈ వ్యాసంలో మూడుగేయాలున్నాయి. ఇవి రాయలసీమ ప్రాంతంలోనివి. అనంతపురం జిల్లాధర్మవరం తాలూకా సుబ్బరావుపేట బోయనరసింహులు నివేదించినది. మిగిలిన గేయాలు కడపజిల్లా పులివెందులతాలూకా ఆలవలపాడు ప్రభుదాస్ నివేదించినవి. మొదటిది కోలాటగేయం 'తాలుపుకిట్టి' అనే కోపులో పాడుకొంటారు. గురువు పాడుతుండగా శిష్యులంతా పల్లవినిమాత్రం పాడుతారు. ధర్మవరం ప్రాంతంలో కోలాట బృందాలెక్కువ. మిగిలిన రెండు గేయాలు చెక్కభజన నృత్యంలోనివి. గురువు పాడుతుండగా గేయాన్ని అంతా శిష్యులు వంత పాడుతారు. పులివెందుల తాలూకాలో చెక్కభజన నృత్య బృందాలెక్కువ. గేయాలు పాడి ఆడుతున్న సమయంలో ఆయా సన్నివేశానికనుగుణంగా హృదయాన్ని ఆకట్టుకొంటాయి. హృదయవికారకంగా ఈ గేయాల రాగాలాపన వుంటుంది. నృత్యం చేస్తున్నప్పుడువింటే గేయమాధుర్యం ఉంటుంది. పులి ఆవును చంపటానికి రావటం, ఆవు వేడుకోవటం, దూడబాధ, తల్లిబిడ్డకు చెప్పేబుద్ధిమాటలు కొనియాడతగ్గవి. ఈ విషయాలన్నీ గేయాల్లో చూడవచ్చు.

కోలుకోలన్నా సెలియా మేలుకొలన్నా దిందరి
కోలుకోలన్నా సెలియా మేలుకొంలన్నా ॥కోలు॥
తొలికోడి కూసినపుడు తొలగెరా భూదేవిమంద
మలికోడి కూసినపుడు మళ్లెరా కవలావలమంద
॥కోలు॥

ఆవు-పులి సంవాదం

ఆవులన్న గోవులన్న ఆవలకాసె బాలుడన్న
నన్నసొల్లది సన్నసిక్కము పిచ్చిగొడ్లి భుజానపెట్టె
సుక్క లాకు పరవతాన సూదిమాలుగుంటిమింద
నోటపద్దిముసెప్పతాడె ముక్కనాడిరుటూపుతాడె
॥కోలు॥

పాకపాక మేటి తరుపు పలములన్ని పాడుచేసె
కొండకొండబురుజుకాడ య్యరకొండ
గేయికాడ పండినాదిరా పూలిరాజు
॥కోలు॥

పులివుండె గేయికాటికి పూలుమేయను పాయనన్న
మేటితరుపు

ఆవుదుక్కు పులి చూసె పులిదుక్కు ఆవుచూసె
వంగిమేసె మేటితరుపును మెడబట్టి కిందికేసె
॥కోలు॥

అప్పయినరా పులిరాజా వన్నయినరా పూలిరాజా
గొడ్డుబడి కొడుకూనుగంటి గోవురంగని పేరుపెడితి
కొడుక్కు పాలిచ్చి వత్త వన్నయినరా పులిరాజా
॥కోలు॥

ఆడవారి మాటలమ్మ నమ్మవచ్చును నమ్మరాదు
అరితిగొచ్చు గొరితికొచ్చు తప్పితే తలసిరికొచ్చు
ఆవలామందాల సొచ్చిగా మల్లవత్తును పులిరాజా
వక్కకొడుకు సొచ్చిగాను తిరిగివత్తును పులిరాజా
॥కోలు॥

ఇంటికాడ గోవురంగడు ఏమంటాని పలుకుతాడె
అందరమ్మ లొచ్చినారు మాయమ్మరాలేదు
॥కోలు॥

కొండకొండ బురుజుకాడ య్యరకొండగేయికూడ
పులిరచ్చ మీయమ్మ యాసబాసలడుగుతాది
॥కోలు॥

అప్పరారా కన్నకొడుకా యాకలి కొనిపోతివన్న
బాసలు చేసిన్నిపాలు బంతిలేకి యక్కవమ్మ
తూరపాన తుంగభద్రలో మునిగితానము సేయవమ్మ
తూరపాన తుంగభద్రలో మునిగితానము చేసియావు

బిడ్డకు పాలిచ్చుకుంటూ బుద్ధిమాటలు సెప్పతుంది
మంటిగడ్డలు సెలకొద్దప్ప మంద్రిగబ్బలు నిన్ను
కరిసేను

పుట్టగడ్డలు సెలకొద్దప్ప పూడుపాములు నిన్ను
కరిసేను

గాండ్లగేరికి పోవద్దప్ప గాండ్లగట్టి నిన్నుతిప్పేరు
కాపుగేరికి పోకొడుకా ముద్దబెట్టి మడగ్గట్టేరు
॥కోలు॥

కొండల కొండల నడుమ కోటియావుల మందలోపుల
పండుయన్నెల బట్టబయలు కలిసిమేసెర యావులు
॥ కో ॥

రాయకసువది గునక కసువది పాయకసువది
పిల్లెపిసరది

నోటికిరిపైన కసువది గునము కల్గిన బోదకసువది
ఆయిదు కసువులు కలిసిచోట ఆవులన్ని మేసెరా
॥ కో ॥

తూర్పున మలిమేసె యావులు పటమట మలిమేసె
యావులు

వుత్తరాన మలిమేసె యావులు దచ్చినాన మలిమేసె
యావులు

తూర్పున మలిమేసె యావులు తూలిమేసెర యావులు
॥ కో ॥

శనివారము గొల్లబోయడు చిన్నియావుల పాలుపిండి
పాలుపిండి దుత్తకెత్తి పదునుగొడ్డలి చేతబట్టి
పిల్లన గోయితో నాదుయెత్తి నూది పింసెర యావులు
॥ కో ॥

ముందకొచ్చెముళ్ళావులారా యనకలొచ్చె
య్యరావులారా

పక్కనొచ్చె పళ్ళావులారా నడుమనొచ్చె
నల్లావులారా

మీ రంతవచ్చుచున్నారు మాయమ్మరాలేదా
మీయమ్మ పులిరాజుతో యాసబాసలడుగుతాది
॥ కో ॥

అన్నరో పులిరాజా ఆకలంటెను నాకుదోసము
లేకలేక కంటినన్న లోకరచ్చాకుని నేను
గొడ్డుమీరి కంటినన్న కోటియావులకోడెను
పులితోను శెలవుతీసుకోని యింటికి పయనమాయె

॥ కొ ॥

పిరికెడేసిన రాళ్ళన్ని పిండిపిండిగ దొక్కుకుంటూ
కంకెడేసిన రాళ్ళన్ని కనకంబుగా తొక్కుకుంటూ
తరువెత్తుతు తరిగెళ్ళదాటుచు పాలుభూమిమీద
చుక్కపడకుండ మందదాపున చేరెరా

॥ కొ ॥

కొడుకురారా సిన్నికిట్నా కొడుకురారా ముద్దుకిట్నా
పాలుతాగి పోదురారా పయనమై పోవాలినేను
ఆరగించుకొందురారా ఆకలితీరంగ నేడు
ముందుయావుల పోకొడకా యనకియావుల పోరాకు కొడకా
యనకి యావుల పోతేకొడకా య్యరగట్ల పులులునిన్ను
యాదసూసిన తినును కొడకా

॥ కొ ॥

కొడుకు కేమో బుద్ధిసెప్పి కృష్ణగోదావరి గంగ, గోదలి అంతుబోదరి
రంతుబోదరి అయిదు గంగల కలిసెచోటు స్నానమాడెర
ఆవుస్నాన మాడినాది పులిదగ్గరకు పోయినాది
అన్నరో పులిరాజా ఆకలంటే నాకుదోసము
తినకపోతే నీకు దోసము
ఆవుసత్తిము పులిమెచ్చె పులిసత్తిం ఆవుమెచ్చె
ఆవుపాదాల మీద పడి పులిప్రాణమిడిచెరా
పులిపాదాల మీదపడి ఆవుపాన మిడిచెరా

॥ కొ ॥

కొండల కొండాల నడుమ కోటియావుల మందలు
పండువెన్నెల పట్టపగలు కలిసిమేసెర యావులు
వుత్తరామలి కలిసిమేసెర వచ్చిన మరి కలిసిమేసెర

॥ కొ ॥

కడుపునిండా మేతమేసి సీల్లకేమో దారిపట్టె
యక్కరాని కొండ యెక్కి దిగరాని కోనదిగి
సీల్లు యేమో తాగినాయి నిలిచి ఏమో చూసినాయి

॥ కొ ॥

అంతలోన పెద్దపులి పేటుపైన తొంగిచూసె
గుప్పుగుప్పున ఎగిరినాది గుడ్లుయ్యర చేసినాది
ఆవులేమో పులినైన కండ్లండా చూసినాయి

॥ కొ ॥

పరుగు పరుగున వచ్చినాది ఆవులాను యంటబాటె
ఆవులన్ని పరుగు పరుగున యింటికేమో దారిపట్టె
అంతలోనే వక్కయావు వక్కడానే చిక్కుకోనే
పులియేమో పరుగు పరుగున వచ్చినాది ఆవునేమో పట్టినాది
మెడబట్టి కిందకేసి చంపుతానని పలుకినాది

॥ కొ ॥

వద్దువద్దు పులిరాజా నన్ను యింక చంపవద్దు
యింటికాడనాకైన వక్కకొడుకైన వున్నాడు
పాలుయిచ్చి వచ్చేదంటు ఆవు ఏమో పలికినాది
పులికతా ఆవుకతా అక్కడేమో అట్లువుండు

॥ కొ ॥

పరుగు పరుగున ఆవులేమో యింటికైన వచ్చినాయి
యింటికేమో వచ్చినాయి దొడ్డిలోపల నిలిచినాయి
దొడ్డిలోపల నిలిచినాయి బిడ్డలాకు పాలుయిచ్చు
అంతలోనే వక్కదూడ అంబా అని అరచుచుండు

॥ కొ ॥

ముందు వచ్చిన ఆవులారా యనకలొచ్చిన ఆవులారా
మా తల్లి రాలేదు యక్కడికి పోయినాది
మీ తల్లి పులిరాజుతో బాసలేమో చేయుచుండె
అమ్మరో నను కన్నతల్లి యవ్వరమ్మ నాకుదిక్కు
ఆ మాట అంటుంది భూమిపైన వరిగినాది
భూమిపైన వరిగినాది గోడుగోడున దుక్కపోయె
అదరించె దిక్కు ఎవరు అంబా అని అరచినాది
దూడకత అక్కడేమో అట్లేనేమో జరుగుచుండు

॥ కొ ॥

పేటుపైన పులి ఏమో ఆవునేమో పట్టినాది
తిందేను నీకు దోసం తినకుందే నాకు ఆకలి
చంపవద్దు చంపవద్దు పులిరాజ అంటుందీ
నమ్మవచ్చు నమ్మకూడదు ఆవు మాట గోవు మాట
బాసఏమో చేసినాది బాటలేమో పట్టినాది
పోయిరావె ఆవు అంటు పులిపలికె

॥ కో ॥

పరుగున పరుగున యింటికేమో దారిపట్టె
ఇంటికేమో దారిపట్టి దొడ్డిలోన నిలిచినాది
రారా నా చిన్ని కిట్నా రారా ముద్దుకిట్నా
పాలుతాగి పోదుగాని పయనమై పోవలెను

॥ కో ॥

అమ్మరో మముకన్నతల్లి ఏమిటమ్మా యీ మాటలు
నీవు పోతే నాకు ఎవరు దిక్కు వున్నారంటుంది
ఆ మాటలందేనే తల్లి ఏమో చూసినాది
గోడుగోడున దుక్కపోయి భూమిపైన వరిగినాది
భూమిపైన వరిగినాది కండ్లనీరు కాల్వలాయె

॥ కో

అమ్మరో మముకన్న తల్లి ఏమిటమ్మ యీ బాద
పులితోను నేను యింత బాసఏమో చేసినాను
రారా చిన్ని కిట్నా రారా నాముద్దుకిట్నా

॥ కో ॥

ఏయయ్యో కొంటాడో ఏగాదికిపోతావో
తన్నవద్దు పొడచవద్దు రారా చిన్ని కిట్నా
పాలుతాగి పోదుగాని పయనమై పోవలెను
పాలు ఏమో కడుపార తాగి ఏమో తాగిపోదువు
పాలుఏమో యిచ్చినాది బాటఏమో పట్టినాది

కో ॥

పరుగు పరుగున వచ్చినాది పులితావున వరిగినాది
తినవయ్యా తినవయ్యా పులిరాజా అంటుంది
ఆ మాట వందేను పులిఏమో చూచినాది

॥ కో ॥

మాటపైన వచ్చినావు మరల యింటికి పోమ్మానె
ఆమాట అందేను ఆవుపైకి లేచినాది
పరుగున పరుగున దొడ్డిలోకి వచ్చినాది
రారా నా చిన్ని కిట్నా రారా నా ముద్దు కిట్నా

॥ కో ॥

ఇలాంటి గేయాలు రాయలసీమ ప్రాంతంలో అనేకంగా ఉన్నాయి. ఈ వ్యాసం తయారు చేయటానికి ఊపునిచ్చినవారు జానపదులు వీరిద్వారా యంఫిల్ డిగ్రీ [ధర్మవరం తాలూకా జానపదగేయాలు-1988] పిహెచ్‌డి డిగ్రీ[జానపదనృత్యకళ ధర్మవరంతాలూకానాధారంగా-1986] సంపాదించగలిగాను. చదువు సంధ్యలులేని జానపదుల నోళ్ళలో నానే ఈసాహిత్యం ఎంతమందికైనా చోటుఇస్తుంది ఇపుడిపుడే అన్నిచోట్లా జానపదసాహిత్యం మాధుర్యాన్ని తెలుసుకొంటున్నారు. విశ్వవిద్యాలయాల్లో పాఠ్యాంశంగా నిలిచిపోయింది. తెలుగు విశ్వవిద్యాలయాల కులపతులు ఆచార్య తూమాటి దోణప్పగారు ఈ సాహిత్య ప్రత్యేక విభాగాలు కూడా ఏర్పాటు చేస్తున్నట్టు వింటున్నాం ఇకనైన ఇలాంటి సాహిత్యాన్ని భద్రపరచటానికి ప్రభుత్వం-ప్రజలు- తెలుగు విశ్వవిద్యాలయం కంకణం కట్టుకోగలదని ఆశిస్తున్నాను.

ఆంధ్రోపన్యాసకుడు
శ్రీ వై. యస్. రాజారెడ్డి డిగ్రీ కళాశాల
పులివెందుల-516890

# శ్రీశ్రీ జ్ఞాపకాలు

— మానేపల్లి

శ్రీశ్రీ భౌతికంగా మరణించి మూడు సంవత్సరాలు నిండిపోయింది. ఆయన అభిమానులందరికీ అతి తరచుగా జ్ఞాపకం వస్తూనే వుంటారు.

శ్రీశ్రీతో నా పరిచయం, జ్ఞాపకాలూ రాయాలంటే చాలా పెద్దవ్యాసం (లేదా చిన్నపుస్తకం) రాయవలసి వుంటుంది.

రచనలతో నా తొలిపరిచయం 1958 నాటిది. నేనప్పటికి రాజమండ్రిలో హైస్కూల్లో చదువుతూ వుండేవాణ్ణి.

శ్రీశ్రీ రచనలతో నాకు మరింత ప్రగాఢ పరిచయం కావడం, ఆయన రచనలన్నీ చదవడం, వాటిని అర్థం చేసుకుందికి ప్రయత్నించడమే కాకుండా ఆయనపై ఒక గొప్ప అభిప్రాయం ఏర్పరచుకోవడం 1960 నాటిది. ఇందుకు కారకులు గురువుగారు రోణంకి అప్పలస్వామిగారు.

శ్రీశ్రీతో వ్యక్తిగత పరిచయం 1970లో విశాఖపట్నంలో ఆయన షష్టిపూర్తి సందర్భంలో జరిగింది. అప్పటికే నాకు రచయితగా పదేళ్ళ అనుభవం వుంది. ఆంధ్రపత్రిక, ప్రభ, జ్యోతి మొదలైన పత్రికల్లోనే కాక సంవేదన, సృజన, ప్రగతి, కళాకేళి, జనధర్మ, భారతి మొదలైన పత్రికల్లో పుంఖాను పుంఖాలుగా రచనలు వెలువరించాను.

కింగ్ జార్జి ఆస్పత్రి ఆవరణలో 1970 ఫిబ్రవరి 2వ తేదీ ద్వయం సభలో శ్రీశ్రీని మొదటిసారి కలుసుకున్నాను. వేదిక పక్కనే కూచుని ఆయన మాట్లాడటం చాలా దగ్గరనుంచి విన్నాను. అక్కడొక చిన్న వివాదం వచ్చింది. అప్పుడు శ్రీశ్రీ లేచి "సినిమా పాటలు రాసినా, చెప్పులు కుట్టినా మనిషికి చిత్తశుద్ధి ముఖ్యం" అని చెప్పడం నాకు బాగా గుర్తుంది.

ఆ సాయంత్రం విశాఖ మునిసిపల్ గ్రౌండ్స్‌లో బహిరంగ సభ తాపీ ధర్మారావు, కొడవటిగంటి కుటుంబరావు వంటి మహానుభావులెందర్నో ఆ సభలోనే కలుసుకున్నాను.

ఆ తరవాత 1978 నవంబరులో విశాఖపట్నం ఎవ్. వి. వో హాంలో జరిగిన పౌరహక్కుల సభలో శ్రీశ్రీతో పాటూ నేనూ సహవక్తని! రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు, జ్వాలాముఖి మొదలైనవారు ప్రసంగించారు. వెరబంద రాజు పోలీసుపాట పాడారు. నేను రెండు కవితలు చదివాను.

శ్రీకాకుళం సాయుధ పోరాట వీరులకోసం నిధి సేకరణకు శ్రీశ్రీ జనంలోకి వెళితే కార్మికులల్లో మూడువందల యాభై రూపాయలకుపైగా ధనం వసూలయింది. ఒకాయన శ్రీశ్రీ పట్టుకున్న జోలిలో వాచీ పడేశారు.

"ఈగలా ఈగరా ఒరికొయ్యకు అందుకుని ఈగరా—" అని శ్రీశ్రీ చాలా ఆవేశంగా కవిత చదివారు.

శ్రీశ్రీ ఎక్కడున్నా ప్రజా ఉద్యమాల్తో మమేకం అయ్యేవారు. యువకులతో ఇట్టే కలిసిపోయేవారు.

ఎక్కడచిన్న 'స్పార్క్' కనిపించినా ప్రోత్సహించే వారు.

ఆ తరవాత 1979 జనవరి చివరివారంలో చిరంపురంలో జరిగిన అఖిల భారత రచయితల మహాసభల్లో శ్రీశ్రీతో మూడురోజులు గడిపే అవకాశం వచ్చింది. ఒకరోజు రాత్రి కొత్తగా రచనలు చేస్తున్న యువరచయితలకోసం ప్రత్యేకం బరంపురంలోని ఒక హైస్కూలు మేడమీద హాల్లో శ్రీశ్రీతో ఒక సమావేశం ఏర్పాటుచేశాం నేనూ, మిత్రుడు విజయచంద్రాను, ఆ సభకు శ్రీశ్రీ అధ్యక్షుడు, నేను ప్రారంభకుణ్ణి. ఆ సభలో' ఇదే సమాధానం అనే కవిత చదివాను. దాన్ని శ్రీశ్రీ ఎంతో మెచ్చుకున్నారు. మర్నాడు మహాసభలో ఆ కవిత చదివినపుడు అనేకులు అభినందన పరంపరలు కురిపించారు. ఆ మూడురోజుల్లోనూ శ్రీశ్రీతో ఎన్నో సంగతులు గంటల తరబడి మాట్లాడి తెలుసుకున్నాను. శ్రీశ్రీకి విసుగు వుండదు. గర్వమూ, నిరాశాకూడా మృగ్యం.

నేను 'అవగాహన' అనే సాహిత్య పత్రిక ప్రారంభించే ఉద్దేశంతో శ్రీశ్రీని ఆ పత్రికకు సందేశం యిమ్మని కోరగా ఆయన అప్పటికప్పుడు ఇలా రాసిచ్చారు

"అవగాహన" సమాజా నికి సంబంధించినదయితేనే సార్థకమవుతుంది.

బూర్జువా సాహిత్యం శవసంస్కృతికి సంకేతం. దీనికెదురుగా శ్రామిక సంస్కృతిని ప్రతిబింబించే సజీవ సాహిత్యాన్ని నిలబెట్టాలి.

యీ పని చెయ్యగలిగిన వారు సామాజిక స్పృహతో సాహిత్య సృష్టి చెయ్యగల రచయితలు మాత్రమే

"అవగాహన" అటువంటి రచయితల వాణిని వినిపించే వేదిక కావాలని నా ఆకాంక్ష.

మకాం. బరంపురం 21-1-1979.

అవగాహన ప్రారంభసంచిక శ్రీశ్రీ ముఖచిత్రంతోనే వెలువడింది. అవగాహనను నేను పత్రికగా నడిపించలేకపోయాను. అప్పుడప్పుడు వెలువడే సాహిత్య సంపుటిగా నేటికి 6 సంపుటాలు ప్రచురించాను.

అవగాహనకు రచన యిస్తామన్నారుగాని, కారణాంతరాల వల్ల ఇవ్వలేకపోయారు.

శ్రీరంగం నారాయణబాబు విషయంలో నాకు శ్రీశ్రీతో విభేదం వుంది. కాని నేరుగా ఎన్నడూ ఆయనతో వివాదానికి దిగలేదు. కారణం శ్రీశ్రీపై గల గౌరవమే! అవగాహన రెండవ సంచికను నారాయణబాబు ముఖచిత్రంతో, ఆయనపై ప్రత్యేక వ్యాసంలో వెలువరించును. 1980 మార్చిలో కాకినాడలో జరిగిన శ్రీశ్రీ సప్తతి పూర్తి ఉత్సవాలకు హాజరై-ఆ సంచిక ఆయనకు స్వయంగా అందజేశాను. ఆ సభలో మిత్రులు మిరియాల రామకృష్ణగారు. శ్రీశ్రీపై తమ అపూర్వ పరిశోధనా గ్రంథాన్ని విశ్వశాంతి విశ్వేశ్వరరావుగారికి అంకితం యిచ్చారు. ఆ సభకు ప్రముఖకవి హరీంద్రనాథ్ ఛట్టోపాధ్యాయ కూడా హాజరయ్యారు. నేను చూసిన ఈ గొప్ప విజయవంతమైన సాహిత్యసభల్లో అదొకటి.

ఆధునిక కవితా పితామహుడు శ్రీ శ్రీ కాదు, గురజాడ అనే అంశంపై వచ్చిన వివాదంలో నేను రోణంకి అప్పలస్వామిగారి పక్షం. శ్రీశ్రీ రోణంకి వారిని నిందించడాన్ని నేను ఇప్పటికీ గర్హిస్తాను.

1982లో శ్రీశ్రీ స్వయంగా 'శ్రీశ్రీ లైబ్రెరీ స్కీము' ప్రారంభించారు. అవగాహన-6వ సంపుటి చెరబండరాజు సంస్మరణ సంపుటి (అక్టోబర్ 1982) గా వెలువరించాను. అది అందుకుని కొంచెం ఆల

స్యంగా శ్రీశ్రీ కార్డు రాశారు. అందులోని అంశాలు యధాతధంగా ఇవీ :

No. 1, South Bank Road
Madras-28
16-11-82

Dear సత్యనారాయణగారు,

"అవగాహన" లన్నీ చూస్తున్నాను.

ప్రస్తుతం నేను "శ్రీశ్రీ ప్రచురణలు" అనే Publishing concernలో తలమునకలుగా వున్నాను. Publicationలో విశేషమేమీ లేదు. Distributionలో విలక్షణమైన ఒక పద్ధతి అవలంభిస్తున్నాము.

Sri Sri Library ద్వారా ఇకమీద నా రచనలన్నీ నా పాఠకులకు నేనే అందజేస్తాను. ఈ లైబ్రరీకి 5వేల మంది సభ్యులు కావాలి.

శ్రీశ్రీ లైబ్రరీకి మీరు కనీసం 10 మంది సభ్యులను (including yourself) చేర్చాలి. సభ్యత్వపు రుసుము ఒక రూపాయి, రసీదులకు బదులు (10 రు.లకు పుస్తకం వెల) తీసుకున్న మొదటి ప్రచురణలో సభ్యత్వపు నెంబరూ నా autograph వుంటాయి.

Yours - Sri Sri

నేను వెంటనే పదిమంది సభ్యులను చేర్పించి, వారి చిరునామాల లిస్టూ, సొమ్మూ శ్రీశ్రీకి పంపించాను. ప్రచురణలో కొంత ఆలస్యం జరిగింది.

1983 మార్చిలో శ్రీశ్రీ నుంచి ఉత్తరం వచ్చింది.

No. 1, South Bank Road,
Madras-28
10-3-83

Dear Satyanarayana garu,

At last శ్రీశ్రీ ప్రచురణలు has started, The first Publication పాడవోయి భారతీయుడా (My Cinema Son s& Verses with notes and comments) is ready, You've enlisted ten members for my శ్రీశ్రీ లైబ్రరి. Kindly give me their names and addresses and send 100Rs M.O. I Shall send 10 copies to your address. Each copy will have the membership number, his name&address as well as my autograph.

Yours sincerely
Sri Sri

ఆ తర్వాత కొద్దిరోజుల్లోనే ఒక కార్డు వచ్చింది.

Madras
1-3-83

Dear Satyanarayana garu

I am this day sending you a V. P. Parcel for Rs. 100/= It contains ten copies of "పాడవోయి భారతీయుడా" (cost of each copy is Rs 10) The amount of 10 Rs which you sent some time ago is membership fee of ten members.

Try to enrol more members for Sri Sri Library, at your lisure, They have the first preferences to secure all శ్రీశ్రీ ప్రచురణలు.

Yours Sincerely
Sri Sri

ఒక్కొక్క రూపాయి సభ్యత్వ రుసుం యిచ్చి శ్రీశ్రీ లైబ్రరీలో చేరిన పెద్దమనుషుల్లో కొందరు ఆ తరువాత పదేసిరూపాయలు యివ్వనేలేదు. చేతి సొమ్ముతో (ఆ సొమ్ము శ్రీశ్రీ చెరుతుంది గనుక)

పార్సెల్ విడిపించి పుస్తకాలు అందరికీ పంచాను. నూరు పేజీల సినిమా పాటల పుస్తకానికి అప్పట్లో పదిరూపాయలధర బాగా ఎక్కువని కొందరు విమర్శించారు.

పార్సెల్ శ్రీశ్రీ ఉత్తరం వున్నది.

No. 1, South Bank Raod
Mandavalli, Madras-600 028
17-3-88

Dear Satyanarayana garu

V. P. పద్ధతి పెట్టుకోదలుచుకోలేదు. కాని మీ విషయంలో మినహాయింపు పాటిస్తున్నాను. మరో 9పేర్లు, చిరునామాలూ నాకు పంపించండి. వాళ్ళ సభ్యత్వపు సంఖ్యలు మాత్రం పుస్తకాల్లో వుంటాయి. (as well as my autograph) ప్రతి పుస్తకంలోనూ పేరూ, చిరునామా (టూకీగా) మీ fill up చేసి ఎవరి పుస్తకం వారికి అందచెయ్యండి.

Many thanks for your prompt response

నాకు పంపే జాబితాలో మాత్రం పేరూ, చిరునామా పూర్తిగా రాయండి. (membership numberతో సహా)

శ్రీశ్రీ ప్రచురణలలో రెండో పుస్తకం సిప్రాలి అనగా సిరిసిరి మువ్వలు.

ప్రాసక్రీడలు.

లిమ బుక్కులు ఇది త్వరలోనే అచ్చుకిచ్చేస్తున్నాను.

శ్రీశ్రీ ప్రచురణల Scheme సక్రమంగా అమలు జెయ్యగలిగితే నాకు Nobel prize మాత్రమే కాదు జ్ఞానపీఠ్ awardకూడా అక్కర్లేదు. (ఇస్తే వొద్దనన్లెండి. అది వేరేసంగతి)!

పురిపండా మహాప్రస్థానం గూర్చి మీ సుదీర్ఘ touched me to the quick.

My health is OK. కాని త్వరలో కళ్ళకి Cataractకి ఆపరేషన్ చేయించుకోవాలి.

wishing you the best,

yours sincerly

Sri Sri

నేను 1982 నవంబర్ 18న పురిపండావారి ఆకస్మికమరణం గురించీ, వారి అంతిమయాత్రలో పాల్గొన్న సంగతి అతి వివరంగా శ్రీశ్రీకి ఉత్తరం రాశాను. దాని సంగతి ఇన్నాళ్ళకి ప్రస్తావించారు.

మీకు నోబెల్ బహుమతి రావాలని కోరుకుంటున్నానని రాసినమాటకి కూడా ఈ వుత్తరంలో సమాధానం రాశారు.

ఆ తరువాత ఆయనకి నేను ఉత్తరం రాయలేదు. కళ్ళకి కేటరాక్ట్ ఉన్నప్పుడు ఇబ్బంది కలిగించడం దేనికని!

ఆయనకు వొంట్లో బాగుండలేదని ఆదృష్టదీపక్ ఆంధ్రజ్యోతి వారపత్రికలో రాసిన కొద్దిరోజులకే, ఆయన మరణవార్త వినవలసివచ్చింది. 1983 జూన్ 15 సాయంత్రం 7గం॥ ప్రాంతంలో శ్రీమతి తుమ్మల కృష్ణాబాయిగారు ఈ విషాదవార్త చెప్పారు. వెంటనే మహాప్రస్థానం లండన్ ప్రతి తెప్పించి శ్రీశ్రీకి కవితా ఓ కవితా ఖండికతో సహా ఈ వార్త ప్రచురించవలసిందిగా 'ఈనాడు' మిత్రులకు కబురు చేశాను. ఆ మిత్రులు నామాట మన్నించారు.

మర్నాడు ఆకాశవాణి, విశాఖపట్నం కేంద్రం నుంచి రాలి శాస్త్రిగారూ, నేను, కొత్తపల్లి రవిబాబు

ప్రభృతులం శ్రీశ్రీ మృతికి మా సంతాపాన్ని తెలియ పరచి తాత్కాలికంగా గుండె బరువుదించుకున్నాం. అదేరోజు విరసం-విశాలాంధ్ర మేడపై ఏర్పాటు చేసిన సభలలోనూ ప్రసంగించాను. శ్రీశ్రీ స్మృతులు ఇప్పటికీ నామనసులో తాజాగా వున్నాయి !

శ్రీశ్రీ లైబ్రరీ స్కీములో ఆయన ముద్రించాలనుకున్న పుస్తకాల వివరాలు ఇవీ :

1. సిప్రాలి (కవిత)
2. అనంతం (1910-25)(స్వీయచరిత్రాత్మక రచన)
3. తెలుగువీర లేవరా (సినిమా పాటలు రెండవ సంపుటం)
4. మహాప్రస్థానం (1930-1940) తర్వాత రాసిన కవితలు.

   1988 వరకూ [illegible] రాసిన కవితలతో సహా వెలువరించాలని ఆయన [illegible] ఉండ వచ్చు.
5. బెండయ్యగారికి గద (ప్రథమాంకం) నాటకం
6. హంసతో ఆరునెలలు (అముద్రితం)
7. షష్ఠవరి (అముద్రితం)

ఇవి 'నవరసాం శ్రీశ్రీ' అనే వ్యాససంపుటి అచ్చు కావలసి వుంది. ఇవన్నీ అచ్చయితేనే గాని శ్రీశ్రీ ఆశయం నెరవేరినట్టు కాగలదు !

తెలుగు లెక్చరర్,
గవర్నమెంటు డిగ్రీ కాలేజి
నరసీపట్నం,
జిల్లా : విశాఖప.




## పంచామృతము

(గేయ సంపుటి)

రచన-రుద్రశ్రీ

ప్రచురణ-విశ్వసాహితి-సికింద్రాబాదు

వెల రూ. 10-00

ప్రతులకు-చిట్టిమల్లె శంకరయ్య (రుద్రశ్రీ)
3-1-81, గణేశవీధి,
జనగాము (పోష్టు) వరంగల్ జిల్లా

ఇది ఐదు గేయనాటికల సంపుటి. ఇందులో అనంత అనుబంధం, బంగారం, చల్లనితల్లి గోదావరి ఓ నల్లమబ్బా ఊరంతవరదా, పల్లకి బోయీలు అనే నాటికలు సంతరించబడినాయి. 'అనంత అనుబంధం' చుక్కలు, చంద్రమసికి, రాధాకృష్ణులకూ సంబంధించిన ప్రణయగాథను పలుకుతున్నది. ఇందులోని ఇతివృత్తం కొంత గజిబిజిగా ఉన్నది. భాషావిషయంలో గానీ, భావంవిషయంలోగానీ చెప్పదగినదిగా లేదు. 'బంగారం' అనే నాటికి చైనావాళ్ళు మన దేశంపై దండెత్తివచ్చిన పరిస్థితిని గూర్చి వ్రాయబడినది. యుద్ధవిజయానికై భారతీయులు బంగారం ఇవ్వవలసినదనీ, కార్మికులూ, కర్షకులూ, కూలీలూ, డాక్టర్లూ తమకర్తవ్యాన్ని స్మక్రమంగా నెరవేరుస్తామని చెప్పడం ఇందులోని విషయం. ఈనాటిక చక్కగా కూర్చబడినది.

అతివృష్టితో ఆంధ్రదేశం బీభత్స పరిస్థితికి గురికావడంచూచి కవి స్పందించిన గుండెతో వ్రాసిన నాటికలు 'చల్లనితల్లి గోదావరి' 'ఓ నల్లమబ్బా ఊరంత వరదా' అనేవి. 'ఓ నల్లమబ్బా' అనే నాటిక అచ్చమైన జానపదభాషలో వ్రాయబడినది. దీనిలోని అంశం ఎవను కదిలిస్తుంది. 'పల్లకి బోయీలు' నాటికలో ఒకకన్య కులంగాని వాణ్ణి ప్రేమిస్తుంది. కులభేదం వల్ల ప్రేమించినవరుణ్ణి పొందలేక ఆ పడుచు కృష్ణలో దూకి ఆత్మహత్య చేసుకుంటుంది. ఈ నాటిక కరుణరసభరితంగా కూర్చబడినది.

ఈ నాటికలలోని గేయాలు చాలావరకు మాత్రా ఛందస్సుకు దూరంగా ఉన్నాయ్. గేయనాటిక మాత్రా చ్ఛందోరహితంగా ఉంటే శోభించదు ఈ సంగతి కవి గ్రహించాలని కోరుతున్నాను. ఈ నాటికలలో కొన్నిచోట్ల భాషా, భావం సొంపుగా ఉండి ఇంపును కలిగిస్తున్నాయి. ఉదాహరణకు ఈ పంక్తులు తిలకించవచ్చు.

"ఈ దేశమే మనము మనము
ఈ మట్టిలో మట్టి మట్టిమి" (బంగారం)

"బరువు పల్లకి తేలికాయెను
బతుకు పల్లకి బరువు తగ్గెను
బరువనుకున్న ఆడపడుచే
బరువులేని నీటి బుడగలాయె॥ (పల్లకిబోయీలు)

—వేముగంటి

# శ్రీరామచంద్ర శతకము

రచన-అద్దంకి రామానుజాచార్యులు
వెల అమూల్యము
ప్రతులకు-రచయిత పేర
హిందీపండిట్ ప్రభుత్వ జూనియర్ కళాశాల
హిరమండలం—532 459
శ్రీకాకుళం జిల్లా

శతకరచన ఏనాడు ప్రారంభమైందోకాని ఈనాటికీ అవిచ్ఛిన్నంగా సాగుతూనే ఉన్నది. ఆధునికకాలంలో తెలుగు కవిత ఎన్నిమార్పులు పొందినా ఆధునికకవు లెందరో శతకరచనచేస్తూ ఆంధ్రసాహిత్యాన్ని సుసంపన్నం కావిస్తుండడం ముదావహం.

ప్రస్తుత శతకరచయిత శ్రీమాన్ అద్దంకి రామానుజాచార్యులు సరసకవి బిరుదాంచితులు. కవిరచన బిరుదునుసార్థకంచేస్తున్నది. ఈశతకం "రమ్యసద్గుణ సాంద్ర! శ్రీరామచంద్ర" అనే మకుటంతో తేటగీతుల్లో వ్రాయబడినది. 'శుచిత్వ సంపన్నుడు వీరత్వసంపన్నుడు శ్రీరామచంద్రుడు' అనేమొదలైన శీర్షికల క్రింద శ్రీరాముని గుణసంపదను వర్ణించడం ఈ శతకంలోని కొత్తదనం. శతకప్రారంభంలో "శ్రీరామచంద్రదివ్య పాదారవిందములకు ఈ శతకము అంకితము" అనే వాక్యాన్ని ప్రతిపద్యం మొదటి అక్షరాలుగా కూర్చబడినది. ఈలాగే శతకం చివర కవి తనపేరులోని ఒక్కొక్క అక్షరాన్ని ప్రతిపద్యం మొదటి అక్షరంగా సంతరించడం జరిగింది. రచనఅంతా సరళంగా, భక్తి భావయుక్తిగా సాగింది. మచ్చుకు రెండుపద్యాలు ఉదహరింపబడుతున్నాయి.

"తిన్నగానైనత క్రిందుతీరునైన
మహిమగలయట్టి నీనామమననచేత
పాపనిర్ముక్తులగుచును బరగుచుంద్రు
రమ్యసద్గుణసాంద్ర ! శ్రీరామచంద్ర !
"వేయిశిరములు, కన్నులువేయి మరియు
వేయిపాదాలు, నామముల్ వేయిబడగి
పురుషసూక్తము వర్ణించు పురుష నీవు"
రమ్యసద్గుణసాంద్ర ! శ్రీరామచంద్ర !"

—వేముగంటి

# పార్థసారథి శతకము

రచన-అద్దంకి రామానుజాచార్యులు
వెల-అమూల్యము
ప్రతులకు—రచయిత పేర-హిందీ పండిట్
ప్రభుత్వ జూనియర్ కళాశాల
హిరమండలం-532 459
శ్రీకాకుళం జిల్లా

ఈ శతకం "పార్థసారథి" అనే మకుటంతో చంపకోత్పలమాలావృత్తాలలో రచింపబడినది. "వాసుదేవ" 'గోపికాలోల' 'నీలమోహన' 'మధుసూదన' మొదలైన పేర్లతో శీర్షికలుంచి, ఆపేర్లలోని అక్షరాలను ప్రతిపద్యం మొదట ప్రయోగించడం ఈ శతకం లోని ప్రత్యేకత. 'మేరుసుధర' అనే సంబోధనక్రింది పద్యాలు ఈ దిగువ ఉదహరింపబడుచున్నాయి.

"మేలొనగూర్పుమయ్య"
"రుచులను వ్యాప్తిజేయు"
"సురముని వంద్య"
"ధీమత వేగరార"
"రక్తిగ గొల్వలేను"

భక్తిని రంగరించుకొని రమ్యంగా సాగిన రచన ఈ శతకం. ఉదాహరణకు ఒక పద్యం చూపబడుతున్నది.

"కన్నుల విందుజేయుతను
కాంతిని గల్గియనంత శోభచే
యన్నుల మిన్నలా వ్రజ
కులాంగన లందఱకుందిరంబుగా
కన్నుల శోభ గూర్చుచది
గాకను పీనుల విందు జేయగా
వెన్నెలయందు నూగెదవు
వేణువు జేకొని పార్థసారథీ !"

-వేముగంటి

# వార్తావాహిని

## బాబుజగజీవన్‌రాంకు కరీంనగరం సమరయోధుల నివాళి

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు-జాతీయ నాయకుడు-గాంధేయవాది-మాజీ భారత ఉపప్రధాని పరిపాలనాదక్షుడు బాబూ జగజీవన్‌రామ్ మరణము పట్ల సంతాపము తెలుపుచు జూలై 9వ తేదీన కరీంనగరములో జిల్లా స్వాతంత్ర్య సమరయోధులసంఘం పక్షాన శ్రీ కె. వి. నరసింగారావు అధ్యక్షతన జరిగిన కరీంనగరము పౌరుల సంతాపసభలో పలువురు ప్రముఖులు సంతాపము ప్రకటిస్తూ బాబూజీకి శ్రద్ధాంజలి ఘటించారు దళిత వర్గాలను సముద్ధరణకొరకు భారత దేశ విముక్తిని తదనంతరము దేశాభివృద్ధికిని జీవితాంతము కృషిచేసిన ఒక మహానాయకుడనియు, ఆయన లేనిలోటు భర్తీ కానటువంటిదనియు ఆయన వ్యక్తిత్వమును ప్రశంసిస్తూ శ్రీబోయనపల్లి వెంకట్రామారావు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సమావేశము ఏకగ్రీవముగా ఆమోదిస్తూ రెండు నిముషాలు మౌనము పాటించినది. శ్రీ కె. వి. నరసింగరావు ప్రసంగిస్తూ ఒక పరిపాలనా దక్షుని దేశం గోల్పోయిందని అన్నారు. సర్వశ్రీ కె. వి. లక్ష్మారెడ్డి, కె రాజలింగం, వెంగలహన్మయ్య నార్ల మలహరి రావు గుప్త, డా. యస్. కె. మొయినొద్దీన్, బి. వి. రామారావు ప్రభృతులు కూడా ప్రసంగిస్తూ బాబూజీకి నివాళులు సమర్పించారు.

## హిందీ ప్రచారక సమ్మేళనం, శ్రీకాకుళంజిల్లా

తే 27.7.86 ఆదివారం ఉదయం గం10-00కు కార్యదర్శి ద. భా. హిందీ ప్రచారసభ (ఆంధ్ర) హైదరాబాద్ వారి ఆగమన సందర్భముగా శ్రీకాకుళం బాపూజీ కళామందిరంలో శ్రీ S.T.P.V. కూర్మాచార్యులు మాజీ M.L.C వారి అధ్యక్షతను జిల్లా హిందీ ప్రచారకుల సమావేశము జరిగినది. శ్రీ. పెంట లక్ష్మణమ్మగారి వేదాధ్యయనముతో సభప్రారంభమైనది. అధ్యక్షులవారు సభప్రారంభిస్తూ హిందీ దేశ సమైక్యతకు దోహదంచేస్తుందని, ఆంధ్రప్రజలు దేశంలో ఎచ్చటకు వెళ్ళినా ఉద్యోగ, వ్యాపారాలలో సులువుగా తమ కార్యకలాపాలు నిర్వర్తించ గలరని చెప్పినారు. శ్రీ ఎ. వి. నరసింహం (వరం) గారు ముఖ్యాతిథి శ్రీ ఎ రామస్వామి గార్కి దుశ్శాలువతో సన్మానముగావించిరి. ఆర్యవైశ్య సంఘము వారుకూడా దుశ్శాలువతోసన్మానముగావించిరి శ్రీపెంటలక్ష్మణశర్మ గారు సన్మానపత్రమును హిందీలో చదివి వినిపించిరి. తరువాత 6 7 తరగతులలో హిందీ బోధన రద్దు చేసినందువలన హిందీ పండితులు ఎదుర్కొంటున్న సమస్యలపై వివరణ యిచ్చిరి. ముఖ్యాతిథి శ్రీ ఎ. రామస్వామి గారు జిల్లా ప్రచారకులకు హిందీ ప్రచార విషయములు, భవిష్యత్కార్యక్రమములు వివరించిరి హిందీని ప్రచారం చేస్తూ రక్షించుకొనే గురుతర బాధ్యత ప్రచారకులపైనే ఆధారపడియున్నదని చెప్పిరి. విశారద విద్యాలయం కార్యదర్శి శ్రీ జె.

కామేశ్వరరావు గారు హిందీ నేర్చుకొననందున కలిగే నష్టాలు, భారతదేశంలో ఎటు వెళ్ళినా ఎదుర్కొనే సమస్యలను స్పష్టముచేసిరి. విద్యాలయం అధ్యక్షులు శ్రీ డా॥ ఎన్. చిట్టిబాబు గారు ప్రస్తుత కాలానికి హిందీ అవసరం అని చెప్తూ యీ సంవత్సరం ప్రచారక విద్యాలయాలు నడపకుండా ఆంధ్రప్రభుత్వం నిలిపివేసినందుకు విచారం వ్యక్తం చేశారు. శ్రీ ఎమ్ శేషాచార్యులు విశాఖపట్నం వారు హిందీ భాషా బోధన యింకా అత్యున్నత స్థాయిలో జరుగగలదని కార్యకర్తలు నిస్వార్థ సేవాభావంతో ప్రచార కార్యం చేయాలని కోరిరి. రా. ప. ఉపాధ్యాయ పరిషత్ జిల్లా కార్యదర్శి శ్రీ యం. వి. శేషాచార్యులు హిందీ పండితులు ఎన్ని సమస్యలు ఎదురైననూ ఉత్సాహంతో భాషాబోధన జరిపించాలని తద్వారా రాబోవు తరాల వారికి మేలుచేకూర్చవలసినదిగా కోరినారు.

శ్రీ పి. జోగారావు గారు ఆంధ్రలో గత 60 సంవత్సరాలుగా హిందీ ప్రచారానికి జరిగిన కృషిని అభివర్ణించారు శ్రీ బి. ఉమామహేశ్వరరావు గారు హిందీ ప్రచారానికి అందరూకలిసి కృషి చేయాలని చెప్పిరి. శ్రీ యన్ బాలకృష్ణ మూర్తి గారు వందన సమర్పణ గావించిరి జనగణమనతో సభ ముగిసినది.

## హిందీప్రేమీమండలి, హైదరాబాదు ప్రమాణపత్ర వితరణోత్సవము

తే. 6-8-1986 బుధవారం సాయంకాలము ఆరు గంటలకు దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర భవనంలో హైదరాబాదు హిందీ ప్రేమీమండలి వారి ఆధ్వర్యమున హిందీ విజయపత్ర వితరణోత్సవము జరిగినది. దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర అధ్యక్షులు శ్రీ వేమూరి సుబ్బారావుగారు సభకు అధ్యక్షత వహించింది

ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రవాణా శాఖామాత్యులు గౌ. శ్రీ డి. సత్యనారాయణ గారు మాట్లాడుతూ దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారు హిందీకి చేయుచున్న సేవను గురించి కొనియాడుచూ హిందీ ప్రచార బాధ్యతలను కేంద్రం స్వీకరించవలసియున్నదని, దీనివలన కలిగే ఆర్థిక భారాన్ని రాష్ట్రాలు భరించలేవని వివరిస్తూ ఇప్పటికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దేశంలోని అన్ని రాష్ట్రాల కన్నా ఉదారమైన నీతిని అనుసరిస్తూ త్రిభాషా సూత్రాన్ని అమలుపరుస్తున్నామని వివరించారు. దేశంలోని ప్రతి పౌరుడు హిందీ నేర్చుకోవాలని నా వ్యక్తిగత అభిప్రాయంగా వెల్లడించారు

ప్రారంభంలో హిందీ ప్రేమీ మండలి అధ్యక్షుడు శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు ఆహూతులకు స్వాగతం పలికారు.

ఆంధ్ర సభ కార్యదర్శి శ్రీ ఏ. రామస్వామిగారు సభకార్యక్రమములను వివరించిరి. తదనంతరం వివిధ హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రములను బహుమతి గ్రహీతలకు పుస్తక రూపేణా బహుమతులను గౌరవనీయులైన మంత్రి శ్రీ డి. సత్యనారాయణగారు అందజేసిరి.

హిందీ ప్రేమీ మండలి కార్యదర్శి శ్రీ వై. యన్ శ్రీకాంత్ ధన్యవాద సమర్పణ తరువాత జనగణమనతో సభ ముగిసినది.

ఈ సందర్భంలో సభాధ్యక్షులు శ్రీ వేమూరి సుబ్బారావుగారు విద్యార్థులను ఆశీర్వదించారు. వారి ప్రసంగ పాఠం—

నలభై సంవత్సరములనుండి ఒక సామాన్యహిందీ ప్రచారకునిగా నా శక్తికొలది పనిచేస్తూ ఉన్నాను. నాయందు పూర్తివిశ్వాసముంచి పోయిన 16 మార్చి నెలాఖరున జరిగిన సభ ఎన్నికలలో నన్ను దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర శాఖకు ఏకగ్రీవ ముగా అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. ఇది నేను ఊహిం చని పరిణామము. అయినా ప్రచారక బంధువులు హిందీ అభిమానులు నాయందుంచిన బాధ్యతను సక్ర మంగా నిర్వర్తించవలసి ఉంది. మహామహులు అధి ష్ఠించిన యీ పదవి నాకు లభించుట అదృష్టమని భావించుచున్నాను. గౌరవనీయులైన కార్యవర్గ సభ్యుల, అనుభవనీయులైన ప్రచారక బంధువుల నభ కార్యకర్తల సహాయ సహకారముతో విశేషంగా మీ విద్యార్థినీ విద్యార్థుల అండదండలతో హిందీ ప్రచార కార్యక్రమాన్ని గాంధీజీ మార్గంలో దిగ్విజయంగా నడిపించి దేశ సమైక్యతకు ఇతోధికంగా కృషి చేయ గలనని సవినయంగా మనవి చేయుచున్నాను.

ఈరోజు దేశపరిస్థితులను చూసినట్లయితే ప్రతి రాష్ట్రంలోనూ ఏదో ఒక రూపేణా అశాంతి కనిపించు చున్నది. దీనికి ప్రధాన కారణం జాతీయ అవగాహన ప్రజలలో లోపించటమే. ఒక స్పష్టమైన జాతీయ దృక్పథమును ప్రజలకు యీ రోజువరకు అందించ లేకపోయినందువలననే ఒక ప్రదేశములో భాష పేరు మీద ఆందోళన ఆరంభమైతే మరొక ప్రదేశంలో ప్రాంతం పేరుమీద, మరొకచోట తిజర్వేషన్ల పేరు మీద..యీ రకంగా చూసినట్లయితే అస్సాం,పంజాబ్ హర్యానా, బెల్గాం, మహారాష్ట్ర, గోవా, ఆంధ్రప్రదేశ్ రాజస్థాన్ మరియు కాశ్మీర్ మొదలైన రాష్ట్రాలు నిత్యం ఏదో ఒక ఆందోళనతో సతమతమవుతున్నవి. స్వాతంత్ర్యం వచ్చి సుమారు నలభై సంవత్సరములు అయినప్పటికీ జాతీయ సమైక్యతను పెంపొందించే జాతీయ భాషా ప్రచారమునకు సమగ్రంగా మొత్తం దేశానికి అనుకూలమైన ఒక విధానం స్పష్టంగా లేదు.

ఈ పని రాజకీయ నాయకుల ద్వారా సాధ్యంకాదని పూజ్యబాపూజీగారు స్వచ్ఛంద సంస్థల ద్వారా హిందీ ప్రచారం ఆరంభించి జాతీయ సమైక్యతకు కృషి చేశారు. ఈనాడు హిందీ ప్రచారంచేసే సంస్థలపై యీ భారం అధికంగా ఏర్పడినది. అవి ఎంతో మెల కువతో ప్రజానాడిని గమనిస్తూ ప్రచారం చేయవలసి ఉన్నది. హిందీ అభిమానులందరూ చేయూతనివ్వాలి. విశేషంగా హిందీ నేర్చుకొనే మీ అందరిపై ఎక్కువ భారం ఉన్నది. మీరు హిందీ నేర్చుకోవటమే కాదు, మీ పరిసరాలలో కూడా విద్య నభ్యసించే విద్యాల యాల్లో హిందీ భాషయందు అభిమానం కలుగునట్లుగా వారికి వివరించవలసి యున్నది. విభిన్న భాషల ప్రజ లను ఐకమత్యంగా ఉంచగలుగుతుంది భాష. ఆ భాష హిందీ అనేది మనకందరకూ తెలుసు. ప్రతిఒక్కరూ జాతీయ భాషా ప్రచారమునకై తమ కర్తవ్యాన్ని నిర్వ ర్తించిన మనమూహించిన సమైక్యభారతం సమగ్రంగా మనగలుగుతుంది. గాంధీజీ కన్నకలలు సఫలమౌతవి.

ఈరోజు విజయపత్ర వితరణోత్సవంలో విజయ పత్రాలను అందుకోనున్న మీ అందరికీ నా శుభా సీస్సులు. హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి వారు సుమారు 30 సంవత్సరముల నుండి హిందీ ప్రచారం చేస్తూ కొన్ని వేలమందికి హిందీ విజయపత్రములు అందజేస్తున్న వారి కృషి ప్రశంసనీయము. వారికి నా మనవి ఏమిటంటే నేడు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న పరిస్థితులననుసరించి హిందీ ప్రచారం ఎంతో క్రమ శిక్షణతో సర్వజనామోదంగా చేయవలసి ఉన్నదని మరువరాదు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆరు, ఏడు తరగతులలో హిందీని తొలగించిన ప్రజా భిప్రాయాన్ని గమనించి జాతీయ సమగ్రతను దృష్టిలో ఉంచుకొని ఎప్పటివలెనే హిందీని పాఠశాలల్లో కొనసాగించగలదని కోరుచున్నాను.

ఈరోజు విజయపత్రాలను స్వీకరించిన మీరు ఇక ముందుగూడా అతి ఉత్సాహంగా హిందీని అభ్యసించ వలసినదిగా కోరుచున్నాను. ఈనాడు హిందీ దిన దినాభివృద్ధి చెందుతూ ప్రభుత్వపు వివిధ శాఖలలో చొచ్చుకుపోతున్నదివృత్తిపరంగాహిందీనభ్యసింకూడా చుట అవసరం. హిందీ భాషకు ఏ ఇతర భాషలతో వైరములేదు. ప్రాంతీయ భాషల అభివృద్ధిపై హిందీ అభివృద్ధి ఆధారపడి ఉన్నది. కాన హిందీప్రచారంలో హిందీ ప్రచారంతోబాటు ప్రాంతీయ భాషల ప్రచారం కూడా చేయబడుచున్నది.దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర హైదరాబాదు-హిందీ ప్రేమీ మండలులు, జిల్లా హిందీ ప్రచారక మండలుల వారు నిర్వర్తించే హిందీ ప్రచార కార్యక్రమము పట్టణ నలుమూలలా వ్యాపించేలా చేసినయెడల సభ సహాయ సహకారము లుండగలవని మనవి చేయుచున్నాను. హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి వారికి నన్ను ఇక్కడికి ఆహ్వానించినందులకు కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

## హిందీ ప్రేమీమండలి, ఏలూరు

హిందీ ప్రేమీమండలి, ఏలూరు కార్యవర్గ సమావేశము ది.6.8 88న శ్రీ పటగర్ల రామమోహనరావు గారి అధ్యక్షతన జరిగినది. ఇందులో ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవంగా ఆమోదించబడినవి.

1. దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర హైదరాబాదు కార్యవర్గసభ్యులు శ్రీరాగి నరసింహులు గారి అకాల మరణానికి ది.6-8-88 తేదీన జరిగిన ఏలూరు హిందీ ప్రేమీమండలి అత్యవసర కార్యవర్గ సమావేశములో కార్యవర్గసభ్యులు తమ ప్రగాఢసంతాపమును తెలియజేస్తూ దివంగతులైన శ్రీనరసింహులు గారి కుటుంబసభ్యులకు హిందీ ప్రేమీమండలి,ఏలూరు తరపున సానుభూతి తెలియజేయబడుచున్నది.

2. దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర హైదరాబాదు కోశాధ్యక్షులు శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తిగారు, ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీకిఅధ్యక్షులుగా ఎన్నికైన సందర్భమున ది. 6.8.88 తేదీని జరిగిన ఏలూరు హిందీ ప్రేమీ మండలి అత్యవసర కార్యవర్గ సమావేశములో వారిని అభినందిస్తూ తీర్మానము చేయడమైనది.

ది. 15 8.88 తేదీని స్వాతంత్ర్య దినోత్సవసందర్భమున ఏలూరు హిందీ ప్రేమీమండలి అవరణలో అధ్యక్షులు శ్రీ పటగర్ల రామమోహనరావు గారు జాతీయ పతాకమును ఆవిష్కరించిరి. విద్యార్థులకు మిఠాయిలు పంచిపెట్టబడినవి.

## జాతీయకవి శ్రీ మైథిలీ శరణగుప్త జన్మ శతజయంత్యోత్సవము

స్థానిక ది ఇండో- ఇంగ్లీషు స్కూలులో 20 జులై 88 తేదీన జాతీయ కవి మైథిలీ శరణ గుప్త శతజయంత్యోత్సవము హిందీ నికేతన్- ఏలూరు ప్రిన్సిపాల్ శ్రీ పిన్నింటి సత్యనారాయణ అధ్యక్షతన పూర్ణిమ, శర్మిలా, స్వర్ణలక్ష్మి ప్రార్థనతో ప్రారంభమైనది. హిందీ అధ్యాపకురాలు శ్రీమతి పి. హైమవతి స్వాగతోపన్యాసము ఇచ్చారు. తదుపరి సభాధ్యక్షులు తన ప్రారంభోపన్యాసములో ఇలా అన్నారు. ఆధునిక హిందీ సాహిత్య నిర్మాణంలో మైథిలీ శరణ్ కు ప్రత్యేక స్థానము ఉంది. ప్రాచీన భారతీయ సంస్కృతి మహత్తును బానిస భారతీయులలో మేల్కొల్పి వారిని స్వతంత్ర పోరాటములో ముందుకు నడిపించారు. "ఆయన భారత భారతి" నుండి "జయభారత్" కావ్యము వరకు ఎన్నో కావ్యాలు రచించి తద్వారా భారతీయులలో ఏకాత్మ భావము కలిగించారు, హిందువులు, క్రైస్తవులు, సిక్కులు, ముస్లిముల మతాలపైన కూడా ఆయన తన కావ్యరచన సాగించి అందరిలో సద్భావమును మేల్కొల్పినారు.

తదుపరి వక్త హిందీ విద్యార్థి సాంస్కృతిక సమ్మేళన్ అధ్యక్షులు అర్బన్ బ్యాంక్ సెక్రటరీ శ్రీ వెత్సా పాండురంగారావు తన ఉపన్యాసములో శ్రీ మైథిలీ రచించిన "భారత-భారతి, పంచవటి, శకుంతల, సైరంధ్రీ, జయద్రథవధ, కిసాన్, యశోధర, ఝుంకార్, కుణాల్ మొదలయిన ఖండకావ్యాల్లో భారత జాతీయ మహత్తునే కాక గాంధి యుగ ప్రభావమును కూడా తెలిపారు. మైథిలీ 'సాకేట్' ప్రబంధ కావ్యములో ఊర్మిళ పాత్రను మనోవైజ్ఞానిక దృష్టితో రచించారు. ఈ పాత్ర స్త్రీ జాతికి మకుటం లాంటిది. 'కాబా-కర్బలా కావ్యము ఇస్లాం మతము, "అనఘ్" సిక్కు మతము, "హిందూ" హిందూ మత పాశస్త్యాన్ని గూర్చి రచించారు.

మహావీర ప్రసాద్-ద్వివేదీ 'సరస్వతి' పత్రికలో మైథిలీ రచనలను ప్రచురించి ఆదర్శ కవిగా రూపొందించారు అని ప్రస్తుతించారు.

సభకు ముఖ్య అతిథి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ-మద్రాసు నిధిపాలక మండలి సభ్యులు శ్రీ నూతలపాటి శ్రీహరి రావు మైథిలీ శరణ్ గూర్చి మాట్లాడుతూ-తన ఉపన్యాసములో ఇలా అన్నారు- భారతదేశములో ఎల్లప్పుడు మహాపురుషులు జన్మిస్తు దేశసమైక్యతను కాపాడుతూ వచ్చారు. హిందీ సాహిత్యములో శ్రీ మైథిలీ తన కావ్యరచనలతో పరాధీన భారత జాతిని మేల్కొల్పడమేకాక, స్వతంత్రభారత జాతిని మార్గనిర్దేశనము చేశారు మత కల్లోలాలతో సతమత మవుతున్న నేటి భారత జాతికి ఆయన కావ్యపఠనము వల్ల మత సహనము ఏర్పడుతుంది. నిజానికి మైథిలీ శరణ్ భారతజాతికి గర్వకారణమైన మనీషి అని జాతీయకవిని ప్రస్తుతించారు.

ఇండో ఇంగ్లీషు స్కూలు ప్రిన్సిపాల్ కుమారి ప్రభావతి తమ స్కూలులో మహాకవి మైథిలీ శరణ్ జన్మశతజయంతిని జరుపుకోవడము ఎంతైనా ఆనంద దాయకమని, మా విద్యార్థులకు ఒక మహాకవి మైథిలీ శరణ్ గుప్తను గురించి తెలుసుకొనే అవకాశము కలిగినందుకు సంతోషమని అన్నారు.

అధ్యక్షులు తమ అంతిమ ఉపన్యాసంతో మహాత్మాగాంధి తన ఉపన్యాసాల ద్వారా భారతీయులలో జాతీయ భావం, జాగరణ కలిగించడానికి ప్రయత్నిస్తే మైథిలీ శరణగుప్త తన కావ్యంద్వారా భారతీయులలో చైతన్యస్రవంతిని ప్రవహింప చేసారని అన్నారు.

తదనంతరము శ్రీమతి పి. హైమవతి వందన సమర్పణతో సభ ముగిసింది.

# ఉచ్చ శిక్షా ఔర్ శోధ్ సంస్థాన్

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ

# బి. ఎడ్. పరీక్షకు గుర్తింపు

ఆంధ్ర విశ్వ విద్యాలయం వాల్తేరు, కేరళ విశ్వవిద్యాలయం తిరువనంతపురం ఈ రెండు విశ్వవిద్యాలయాలూ దక్షిణ భారత హిందీ ప్రచారసభ, పోస్టు గ్రాడ్యుయేట్ అండ్ రిసెర్చి కాంప్లెక్స్ వారు నడుపుతున్న బి ఎడ్. పరీక్షను తమ విశ్వవిద్యాలయాలు నడుపుతున్న బి.ఎడ్. పరీక్షకు సమానంగా అంగీకరించినవి

ANDHRA UNIVERSITY

No. L6-Recogn. Exams/85 — Waltair, Dt. 1-8-1986.

From : The Registrar.

To
1. The three Principals of the University Colleges
2. The Special Officers of the three A U. P. G, Extension Centres at Kakinada, Nuzvid and Srikakulam
3. The Principals of all affiliated colleges including professional and Oriental Colleges.

Sir,

Sub :- Recognition of Examinations- Regarding.
Ref :- A. C. Resolution No. 6 Dt. 29-3-1986.

Iam to inform you that the Academic Council at its meeting held on 29-8-86 has approved or otherwise the recognition of the following Examinations of the other Universities/Institutions as equivalent to the corresponding examinations of this University or not equivalent to as the case may be for purposes of admission to higher courses of study on reciprocal basis:

| S. No. | Name of the Degree or Examination or Diploma | Name of the University or Institution | Name of the Degree or Diploma of this University to which it is equivalent |
|---|---|---|---|
| 1. | B. Ed. Degree | Gulbarga University, Gulbrrga and | B. Ed. Degree |
| 2. | | Dakshina Bharat Hindi Prachar Sabha, Hyderabad. | |

(Sd/- X X X
P. Ramachandra Rao
Deputy Registrar Academic

// TRUE COPY //

# UNIVERSITY OF KERALA

(Abstract)

Recognition of B. Ed degree awarded by the Dakshina Bharat Hindi Prachar Sabha - Madras - Granted - Orders issued

## ACADEMIC 'C' SECTION

No. Acc. 3/2001/85 (Misc) Dated, Trivandrum, 14th January 86.

Read :- Letter No. 6/1565/84-85 dated 11-1-85 received from the Registrar D. B. H. B. Sabha, Madras.

## ORDER

Sanction has been accorded by the Vice-Chancellor, Subject to ratification by the Academic Council to the B. Ed Degree awarded by the Dakshina Bharat Hindi Prachar Sabha, Madras being recognised as equivalent to the B. Ed Degree awarded by the University of Kerala on a reciprocal basis.

Sd/-
S. RAMANUJA
Deputy Registrar (Acad)
For Registrar

To

1. The Registrar, Dakshina Bharat Hindi Prachar Sabha, Madras (With C. L)
2. The Secretary, Dhakshina Bharat Hindi Prachar Sabha, Chittoor Road, Cochin 682 016.
3. The Principals of Training Colleges affiliated to the University of Kerala.
4. The Controller of Examinations University of Kerala.
5. The Deputy Registrer Acad. II/Exam. I. II. III & IV
6. Ac. B/Ac. D Sections
7. Acad. A. III/E. F. II Section
8. Ac. L
9. Stock File/File Copy.

Forwarded By Order
Section Officer.

// True Copy //

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ– ఆంధ్ర

## హైదరాబాదు

## విజ్ఞప్తి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర గత 50 సంవత్సరాలుగా ఆంధ్ర ప్రాంతంలో హిందీ ప్రచారం గావించుచున్నది. ఇది మన మాతృసంస్థ. ఈ సంస్థ కేంద్ర ప్రభుత్వం వారి ఆర్థిక సహాయముతో ఈ క్రింది ప్రణాళికలను అమలు పరచుచున్నది.

1. నాలుగు హిందీ మహా విద్యాలయములు.
2. హిందీ విశారద విద్యాలయములు.
3. 4 హిందీ టైప్ రైటింగ్ విద్యాలయములు.
4. 270 ఉచిత హిందీ తరగతులు (సహాయత ప్రచారకులు) ఇవిగాక

ఆంధ్రసభ తమ స్వంత నిధులనుంచి

1. స్వతంత్ర ప్రచారక గ్రాంటు
2. మాన్యత పొందిన కార్యాలయములకు గ్రాంటు.
3. 'స్వర్ణోత్సవ హిందీ పరిచయ్' పరీక్ష నడిపిన గ్రాంటు ఇచ్చుచున్నది.

ప్రభుత్వ ప్రణాళిక ననుసరించి లేక సభస్వంత నిధులనుంచి గాని ప్రచారకులకు సభ నియమావళి ననుసరించి గ్రాంటు ఇవ్వబడును. ఇదిగాక సభ పరీక్షలకు పరీక్షార్థులను తయారు చేయువారిని పరీక్షకులుగా నియమించి ప్రోత్సహించుటకు కూడా అవకాశము ఏర్పడు చున్నది.

సభ విశారద మరియు ప్రవీణ పరీక్షలలో ఉత్తీర్ణులయి ప్రమాణిత ప్రచారకులుగా రిజిష్టరు ఆయినవారికి గ్రాంటు పొందు అవకాశము ఏర్పడును. సభకు మీ సహకారము నందించి మీరు సభనుంచి సహాయము పొందగలరు.

ప్రమాణిత ప్రచారకులుగా రిజిష్టరగుట కాధారములు, స్వతంత్ర ప్రచారక నియమావళులు, ఇతర వివరములు ఆంధ్రసభకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఎ. రామస్వామి

కార్యదర్శి



ది. 27-7-1986న శ్రీకాకుళంతో హిందీ ప్రచారకుల సమావేశము జరిగిన సంద
ర్భంలో తీయబడిన ఛాయాచిత్రం. ఇందు ఎడమనుంచి వరుసగా సర్వశ్రీ (1) ఎమ్. శేషాచారి
జె కామేశ్వరరావు, పి, జోగరావు, STV కూర్మాచార్యులు, ఎ. రామస్వామి. పెంటా
లక్ష్మణ శర్మగారు ఆసీనులై ఉన్నారు. శ్రీ బి. ఉమామహేశ్వరరావు, శ్రీ బాలకృష్ణ మూర్తి
గారలు తదితరులు నిలబడి ఉన్నారు.





దీ. 6-8-1986 న హిందీ ప్రేమీమండలి, హైదరాబాదు ఆధ్వర్యంలో సభా ప్రాంగణంలో విజయపత్ర వితరణోత్సవము జరిగిన సందర్భంలో తీయబడిన చిత్రాలు.

పై చిత్రంలో- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రవాణా శాఖామాత్యులు శ్రీ డి సత్యనారాయణ గారు ఉపన్యసిస్తున్నారు ప్రక్కన మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు ఆసీనులై ఉన్నారు.

క్రింది చిత్రంలో- ఆంధ్ర సభ అధ్యక్షులు శ్రీ వేమూరి సుబ్బారావు గారు ప్రసంగిస్తున్నారు. ప్రక్కన సభ కార్యదర్శి శ్రీ ఎ. రామస్వామి గారు ఆసీనులై ఉన్నారు.

**Edited, Printed and Published by A. Ramaswamy on behalf of the D.B. Hindi Prachar Sabha-Andhra, -9 Khairatabad, Hyderabad-500 004.**